శ్రీ

# రత్నపాంచాలిక

## (నాటిక)

(శ్రీసర్వజ్ఞసింగభూపాలునిసంస్కృతకృతి కాంధ్రీకృతి)


రచయిత

**పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి**

ఆంధ్రాధ్యాపకుఁడు

వేంకటగిరిరాజకళాశాల

నెలూరు



ప్రకాశకులు

**చిదంబరగ్రంథమాల**

కాకినాడ

1947




[వెల రు 1-0-0

# కృతిసమర్పణము

క. శ్రీవేంకటేశ్వరా, సం
భావితవిద్వత్కవీంద్రవాంఛాపూర్తీ,
పావితలోకత్రితయా,
కావించెద నొక్కమనవి కరుణింపఁ గదే.

చ. లలితకవిత్వమంజులము శ్లాఘ్యరసస్ఫురణంబు కల్పనా
కలితము సత్కవీంద్రగణగణ్యము ప్రాజ్ఞుఁడు సింగభూవరుం
డలవడ వ్రాసె మున్ 'కువలయావలి' సంస్కృతభాష; దానినేఁ
దెలుఁగొనరించి నిన్ గృతిపతిన్ బొనరించితి వేంకటేశ్వరా,

క. అలమేలుమంగకును మ
త్సులలితకావ్యాత్మజకును జొక్కపుటక్కా
చెలియండ్రమైత్రిఁ గూరిచి
కలకాలం బేలికొనుము కారుణ్యనిధీ,

క. సకలచరాచరజంతు
ప్రకరంబు భరించు శేషపర్వతపతి, నీ
కకలంకగుణాన్విత మా
మకకృతికన్యక నొసఁగి మాన్యుఁడ నైతిన్.

శా. భారద్వాజపవిత్రగోత్రుఁ గనకాంబాశుక్తిరత్నంబు సీ
తారామార్యసుతున్ జిదంబరకవీంద్రస్రష్టసోదర్యునిన్
స్ఫారోదారకవిత్వభూషుఁ గృతికన్యాదాత విశ్వేశ్వరున్
గారుణ్యామృతవృష్టిదృష్టిఁ గనుమా కల్యాణసంధాయకా,

---

# ఇందలి పాత్రలు

1. శ్రీకృష్ణుఁడు—కథానాయకుఁడు.
2. నారదుఁడు.
3. మాతలి—ఇంద్రునిసారథి.
4. శ్రీవత్సుఁడు—విదూషకుఁడు.
5 కంచుకి.
6. మహోదరుఁడు—కువలయావలి నపహరించినదానవుఁడు.
7. కువలయావలి—నాయిక.
8. రుక్మిణి.
9. సత్యభామ.
10. జాంబవతి, కాళింది, మిత్రవింద, లక్షణ, సుశీల.
11. చంద్రలేఖ—కువలయావలిచెలికత్తె.
12. చతురిక—సత్యభామదాసి.
13. సుగంధిక—రుక్మిణిదాసి.
14. కస్తూరిక
15. ఘనసారిక } అంతఃపురపరిచారికలు.
16. చకోరిక
17. సహకారిక—ఉద్యానవనపాలిక.

# భూమిక

'కువలయావలి' యను నామాంతరము గల యీ 'రత్న పాంచాలికా' నాటికను రచించినవాఁడు శ్రీ సర్వజ్ఞసింగ భూపాలుఁడు. ఈప్రభువు రేచర్లగోత్రవర్ధనుఁడు. అన్నమాంబాన్నపోతభూపాలగర్భశుక్తిముక్తాఫలము సంగీతసాహిత్య నిధి. లలితకవితావిలాసచతురాననుఁడు. విద్వత్కవిపోషణ దీక్షితుఁడు. 'సర్వజ్ఞ' బిరుదాంకితుఁడు. ప్రతిగండభైరవుఁడు. ఖడ్గనారాయణుఁడు. 'రాచకొండ'ను రాజధానిగాఁ జేసికొని వింధ్యశ్రీశైలమధ్యదేశమును ధర్మోత్తరముగాఁ బాలించిన మహారాజు. కళింగదేశాధిపతిపుత్రిక నుపాయనముగాఁ గైకొన్న మహావీరుఁడు.

# కాలము

శ్రీ సింగభూపాలుని కాలమునుగూర్చి పలువురు పలు రీతుల వ్రాసి సంశయగ్రస్త మొనరించినారు. ఐనను నీతని తండ్రియగు 'అనపోతనాయని' *శాసనములు శా. శ. ౧౩౦౨. (క్రీ. శ. 1380) వఱకుఁ గలవు. పిమ్మట నీతని యాఱవపుత్రుఁ డగుమాదానాయని భార్య 'నాగాంబిక' నెల కొల్పిన †శాసనము శా. శ. ౧౩౫౧. (క్రీ. శ. 1429) నాఁటిది కలదు. కావున నీమహారాజా జేసంవత్సరము మొదలేసంవత్సర

*. †. ఈశాసనములు "వెలుగోటివారి వంశచరిత్రములో- అనుబంధమున" ముద్రింపఁబడియున్నవి.

ము దాఁక రాజ్యము నేలెనో సరిగాఁ జెప్పుటకుఁ దగినశాసనా ద్యాధారము లిప్పటికి దొరకకున్నను బై శాసనములకు నడుమ నున్నకాలమే యీసింగభూపాలునిరాజ్యపాలనకాల మని మాత్రము మన మూహింపవచ్చును. ఈమహారాజు చిరకాల ము జీవించి రాజ్యపాలనము చేసిన ట్లీక్రిందిశ్లోకము తెలుపు చున్నది.

శ్లో. అథ శ్రీ సింగభూపాలో, దీర్ఘాయుర్వసుధామిమామ్ ।
నిజాంసపీఠే నిర్వ్యాజం, కురుతే సుప్రతిష్ఠితామ్॥

రసార్ణవసుధాకరము. ౧.

ఈ సింగభూపాలుఁడును పెదకోమటి వేమభూపాలుఁడును సమకాలికు లనియును, వీరిరువురకు స్పర్థ యున్న దనియును, ఒకరిని మించి యొకరు గ్రంథరచన విద్వత్పోషణాదికమును జేసి యున్నా రనియును, క్రీ. శ. 1403 మొదలు 1420 వఱకుఁ బెదకోమటి వేమారెడ్డి రాజ్య మేలె ననియును శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'శృంగార శ్రీనాథము'న వ్రాసి యున్నారు. దీనినిబట్టి కూడఁ బై కాలనిర్ణయము సరియైనదే యని మనము విశ్వసింపవచ్చును.

శ్రీనాథుఁ డీసింగభూపాలుని దర్శింప వచ్చినప్పుడు సరస్వతి నీవిధముగా స్తుతించెను.

సీ. దీనారటంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశుముత్యాలశాలఁ

బగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి
గౌడడిండిమభట్టుకంచుఢక్క
చంద్రభూషక్రియాశక్తిరాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమబిరుదు
పలుకుఁదో డై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథసందర్భమునకు

గీ. నెటుల మెప్పించెదో నన్ను నింకమీఁద
రావుసింగమహీపాలు ధీవిశాలు
నింపుకొలువున నెలకొని యుండి నీవు
సరసస్గుణనికురుంబ, శారదాంబ,

శ్రీనాథుఁడు క్రీ. శ. 1420 తరువాత నల్పకాలములోనే కర్ణాటాధీశ్వరుఁ డగు ప్రౌఢదేవరాయలసభాంతరాళమునఁ గనకాభిషేకసత్కారముఁ బడసి యక్కడనుండి యీసింగభూపాలుని యాస్థానమునకు వచ్చె నని తోఁచెడిని.

## పాండిత్యము, గ్రంథములు

ఈ మహారాజకవి యలంకారశాస్త్రమునను, సంగీతనాట్యశాస్త్రములందును, వ్యాకరణాదీతరశాస్త్రములందును గొప్పప్రజ్ఞ గలవాఁ డని యేఁతత్కృతులను బట్టియు, మఱికొన్ని యితరసాధనములఁ బట్టియు, మనము నిర్ణయింప వచ్చును. ఈ లేఁడు వ్రాసినగ్రంథము లిప్పటికి మూఁడుమాత్రమే లభించినవి.

ఈసింగభూపతి తండ్రి యైన యనపోతభూపాలుఁడు రాజ్య పాలనము చేయుచుండఁగా నాతనిఁ బేర్కొనుచు విశ్వేశ్వర కవిశిష్యుఁడును, పశుపతిపుత్రుఁడును నగు 'నాగనాథకవి' 'మదనవిలాస' మను భాణమును రచించినాఁడఁట. మఱియు 'అభిరామరాఘవ'మనునామాంతరము గల 'అనపోత నాయకీయ' మనుగ్రంథము నెవరో రచించి యున్నారు. దాని లోనుండి కొన్నిశ్లోకములు 'రసార్ణవసుధాకరము'న నుదాహరింపఁబడినవి.

ఈసింగభూపాలునకు 'అనపోత, దాచ, వల్లభ, వేదగిరి, దామ, మాధవభూపతు' లనునార్వురు కుమారులు గలరు. వీరిలో నాఱవవాఁ డగు 'మాధవభూపతి' వాల్మీకిరామాయణమునకు "రాఘవీయ"మను వ్యాఖ్యానమును రచించినట్లు తద్భూపాలుని భార్య 'నాగాంబిక' నెలకొల్పిన శా. శ. ౧౩౪౯ (క్రీ. శ. 1427) నాఁటి 'నాగారము' శాసనములోని యీక్రింది శ్లోకమువలనఁ దెలియు చున్నది.

శ్లో. శాకాఖ్యే నిధివార్ధిరామశశిగేష్వబ్దే ప్లవంగే శుభే
మాసేష్వాశ్వయుజే రఘూద్వహపదే యో రాఘవీయాహ్వయాం
టీకామర్థపటుప్రభోగఘటనామాణిక్యపుష్పాంజలిం
కృత్వా రాజతి రావు మాధవనృపో రామాయణస్య శ్రియే.

ఈవిధముగా వీరి వంశము పండితప్రభువంశమై వన్నెకెక్కినది.

1. రసార్ణవసుధాకరము:—

ఇది యలంకారశాస్త్రగ్రంథము. ఇందు 'నాయక, రస, నాటక' లక్షణలక్ష్యములు మూఁడువిలాసములలోఁ జక్కఁగా విమర్శించి నిరూపింపఁబడినవి. 'రూపకలక్షణప్రతిపాదకగ్రంథములలో రూపకములకు సంబంధించిన సకలవిషయములను బ్రతిపాదించునదియును మిగుల లలితమును నగునిట్టిగ్రంథము మఱియొకటి లేదని తలఁచెదను' అని మహామహోపాధ్యాయ, తరువై, గణపతిశాస్త్రిగా రీగ్రంథమును గూర్చి వ్రాసి యున్నారు. ఇంత యేల? వ్యాఖ్యాతృచక్రవర్తి యగుమల్లినాథసూరియే తనరఘువంశాదివ్యాఖ్యానములం దనేకస్థలములలో నీగ్రంథమును బ్రమాణముగా గ్రహించి యున్నాఁడు.

2. సంగీతసుధాకరము:—

ఇది నిశ్శంకశార్ఙ్గదేవుని 'సంగీతరత్నాకరము'నకు వ్యాఖ్యానము. సంగీతరత్నాకరవ్యాఖ్యలలో నిది యుత్తమ మని విద్వాంసులచేఁ గొనియాడఁబడినది.

3. రత్నపాంచాలిక:—

ఇది నాలుగంకములనాటిక. 'కువలయావలి'యని దీనికి మఱియొకపేరు గలదు. 'రత్నపాంచాలిక' యనుపేరు కవి యీగ్రంథమున నెక్కడను వాడలేదు. కాని గ్రంథాంతమునఁ గల యీక్రిందిశ్లోకమునుబట్టి దీని కీపేరు గూడఁ గల దని తెలియు చున్నది.

శ్లో. పూర్ణేయం సింగభూపేన, గ్రథితా మధుజల్పితైః ।
రత్నపాంచాలికా నామ, నాటికా రసపేటికా.

భూదేవి కువలయావలియై యవతరింపఁగా నామెను శ్రీకృష్ణుఁడు వివాహమాడుటయిందలి కథ. నారదుఁ డిచ్చిన రత్నాంగుళీయకప్రభావమునఁ గువలయావలి మొదట శ్రీకృష్ణునకు రత్నపాంచాలికవలె నగపడెను. అందుచే నీగ్రంథమునకు 'రత్నపాంచాలిక' యనునామాంతరము వచ్చియుండును. ఇందు బహుస్థలములలో 'రత్నపాంచాలికా' శబ్దమును గవి వాడుట కూడ దీనికి స్ఫోరకము.

4. చమత్కారచంద్రిక:—

ఇది సింగభూపాలునియాస్థానకవియును, కాశీశ్వర మిశ్రునిశిష్యుఁడును, నాగనాథకవిగురువును నగువిశ్వేశ్వరకవి రచించినయలంకారశాస్త్రగ్రంథము. ఇందు రసార్ణవసుధాకరమునఁ జెప్పఁబడనివిషయము లన్నియును సవిమర్శముగాఁ జెప్పఁబడినవి. రాజును దద్విద్వాంసుఁడును సమగ్ర మగునలంకారశాస్త్రము నీవిధముగా నాంధ్రులకు సమకూర్చిపెట్టిరి. ప్రతాపరుద్రీయము, అప్పారాయయశశ్చంద్రోదయము, సాహిత్యరత్నాకరము మున్నగుగ్రంథములందుఁ బ్రతాపరుద్రుఁడు మున్నగువారిపాండిత్య శౌర్య సౌందర్యధర్మపరిపాలనాదులను బ్రకటించుశ్లోకములను విద్యానాథాదికవులు తామే రచించి యుదాహరించినట్లు సింగభూపాలునిపాండిత్యశౌర్యసౌందర్య

ధర్మపరిపాలనాదులను వెల్లడించుశ్లోకములను విశ్వేశ్వరకవి రచియించి యిం దుదాహరించియున్నాఁడు. నేనీగ్రంథమును సమగ్రముగా సంపాదించి పరిశోధించి యున్నాను. ఇంతవఱకు నీగ్రంథము ముద్రితము గాకుండుట శోచనీయము.

౫. అమరకోశవ్యాఖ్య:—

అనర్ఘరాఘవ వ్యాఖ్యాత యగుబొమ్మకంటి హరిహర పండితునిగురువును, వేదవేదాంగవేత్తయు, శ్రీసింగభూపాలునియాస్థానపండితుఁడును నగు బొమ్మకంటి అప్పయార్యుఁడు దీనిని రచించెను. ఈవ్యాఖ్యానమునకుఁ దుదిని దనను గూర్చియు సింగభూపాలునిఁ గూర్చియు నీక్రిందివిధమున నితఁడు చెప్పియున్నాఁడు.

శ్లో. ఆద్యో వేదవిదాం కణాదకపిలవ్యాసాహిరాడంఘ్రిదృ
క్పాణిన్యాదిసమష్టిమూర్తి రవధిస్సార్థత్రిమూవేదినామ్,
వ్యాచష్టామరసింహనాథరచితం గ్రంథం నిఘంటూత్తమం
ఖ్యాతం శిష్యహితార్థ మప్పయసుధీశ్శ్రీమారపోతాభిధః.

శ్లో. రేచర్లవంశసంభూతే, రాస్థాన్యాం సింగభూపతేః।
బొమ్మకంట్యప్పయాచార్య, మూర్త్యా జాగర్తి శారదా.

శ్లో. కుమారసింగభూపేన, లక్ష్యలక్షణవేదినా।
శోధితశ్చేదయం గ్రంథః, కిం శోధ్యశ్శోధకాంతరైః.

శ్లో. కుమారసింగభూపేన, యః కదాపి న శోధితః।
స గ్రంథశ్శోధితోప్యన్యైః, కిం వ్యవహ్రియతే బుధైః.

శ్లో. కావ్యాలంకారనానార్థ, తత్త్వభావితమానసః ।
కుమారసింగభూపాల, ఏక ఏవాస్తి నాపరః.

శ్లో. కుమారసింగభూపాల, కృతయస్తస్య నిత్యశః।
ఏధయంతి ముదం దృష్ట్వా, దృష్టాంతాః కృతినః పరమ్.

(వేదవేత్తయు, వ్యాకరణ, ద్వివిధతర్క, సాంఖ్య, వేదాంతాదిశాస్త్రకూలంకషపాండిత్యమండితుఁడును, స్మార్తక్రియలు చక్కఁగా నెఱిఁగినవాఁడును, మారపోతాభిధుఁడును నగు 'అప్పయ'విద్వాంసుఁడు శిష్యహితమునకై యమరకోశమునకు వ్యాఖ్యానమును రచించెను. రేచర్లగోత్రోద్భవుఁ డగు సింగభూపాలునియాస్థానమున సరస్వతి బొమ్మకంటి అప్పయాచార్యరూపమున నున్నది. లక్ష్యలక్షణవేత్త యగుసింగభూపాలుఁడు శోధించినగ్రంథము నితరులు శోధింప నవసరము లేదు. ఇతరులు శోధించినను సింగభూపాలుఁడు శోధింపకున్న నాగ్రంథమును విద్వాంసులు ప్రమాణముగా స్వీకరింపరు. కావ్యాలంకారనానార్థతత్త్వభావితమానసుఁడు సింగభూపాలుడొక్కఁడే కలఁడు గాని యితరుఁడు లేఁడు. సింగభూపాలుని గ్రంథములు తత్పాండిత్యమునకు దృష్టాంతభూతములు నానందవర్ధకములు నై యున్నవి)

ఈగ్రంథము గూడ నింతవఱకు ముద్రింపఁబడలేదు. సింగభూపాలునకు సంబంధించినగ్రంథము లన్నియును ముద్రింపఁబడినచే గాని యాప్రభువుచేసినవిద్యాపోషణమును, ఆభూపాల

షుణికిఁ గలపాండిత్యాదులును లోకమునకు వెల్లడికావు. ఈ విషయమునఁ దద్వంశస్థు లెల్లరుఁ దగినయుత్సాహము కనఁ బఱుతురుగాక యని కోరుచున్నాను.

## విద్వత్పోషణము

ఈవిద్వత్ప్రభువు విద్వత్కవుల ననేకులఁ బోషించెను. విశ్వేశ్వరకవి, బొమ్మకంటి అప్పయార్యుఁడు మున్నగువా రీతనియాస్థానపండితులు. విశ్వేశ్వరకవిపై నీప్రభువునకు మిక్కిలి యాదరము కలదు. కావుననే,

(సానుసంధానగౌరవమ్)

శ్లో. అహో సాహిత్యసౌభాగ్యం, శ్రీసింగధరణీపతేః ।
శ్లాఘాయై యస్య సన్నద్ధా, విశ్వేశ్వరసరస్వతీ.

అని చమత్కారచంద్రికలో విశ్వేశ్వరకవి రచించిన యీ శ్లోకమును సగౌరవముగాఁ దనరత్నపాంచాలికానాటికలోఁ జేర్చికొన్నాఁడు. ఈప్రభువుపై విశ్వేశ్వరకవికిఁ గూడ నట్టి యభిమానమే కలదు. కావుననే చమత్కారచంద్రికవంటి గ్రంథమును రచించి తనప్రభువుకీర్తి నాచంద్రార్కముగా నిలిపినాఁడు. ఈవిశ్వేశ్వరకవి 'వీరభద్రవిజృంభణము, కరుణాకందళము, కందర్పసంభవము' అను గ్రంథములు గూడ రచించినట్లు 'చమత్కారచంద్రికా, రసార్ణవసుధాకరము' లను బట్టి తెలియుచున్నది.

వ్యాఖ్యాతృచక్రవర్తి యగుమల్లినాథుఁడు మనసర్వజ్ఞు నొద్ద స్వర్ణాభిషేకభాగ్యము నందినాఁడఁట. ఈవిషయమును గొలచలమ నారాయణపండితుఁడు తనచంపూరామాయణ వ్యాఖ్యలో "సర్వజ్ఞేనాభివర్షితః" అని చెప్పినాఁడు. ఈప్రభు శిఖామణికిఁ గొలవి అబ్బయామాత్యునిపుత్రులు 'బాచన, సింగనలు' మంత్రులుగా నున్నట్లీక్రిందిపద్యమునఁ గొలవి గోపరాజు చెప్పియున్నాఁడు.

క. ఘను లగ్రజులకు నీడై
వనములఁ గ్రతువులును గృతులు వడి నిల్పిరి; బా
చనయును సింగనయును దగి
రనపోతకుమారసింగయకు మంత్రు లనన్.

సింహాసనద్వాత్రింశిక. ౧. ౪౮.

శ్రీనాథుఁ డీప్రభువును దర్శించి యర్హసత్కారముల నందెను. ఇంక నెందఱెందఱు విద్వాంసు లీవిద్వత్ప్రభువుమన్న నలకుఁ బాత్రము లైరో ?

## శౌర్యాదార్యాదులు

శ్లో. శ్రీసింగభూమిరమణే భరితప్రతాపే
నాన్యే స్ఫురంతి రణసీమని రాజలోకాః,
కిం వా స్ఫురంతి రటితస్పృశి పాంచజన్యే
లీలానుకారితరుణీజనకూజితాని.

చమత్కారచంద్రిక. ౧ విలాసము.

(పూర్ణప్రతాపుఁ డగుసింగభూపాలుఁడు రణరంగమున నిలిచి యుండ-పాంచజన్యము ధ్వనించుచుండఁ దరుణీజనలీలాసల్లాపములుఁబోలె-నితరరాజులు స్ఫురింపరు)

శ్లో. అర్థస్య పురుషో దాస, ఇతి వక్త్రాద్య లజ్జతామ్।
దాసా హి పురుషస్యార్థాః, పశ్యతస్సింగభూపతిమ్.

చమ. ౬ విలాసము.

(సింగభూపాలునిదర్శించినపురుషునకు ద్రవ్యమే దాసభావమును భజించుచున్నది. కావునఁ బురుషుఁడు ద్రవ్యమునకు దాసుఁడని చెప్పినపురాణకర్త యిప్పుడు సిగ్గుపడవలసియున్నది)

శ్లో. శ్రీసింగనృపో విభవే, ధనుషి నయే వపుషి రంజనే జిష్ణుమ్।
తత్పుత్త్రం తన్మిత్త్రం, తత్పుత్త్రం జయతి తన్మిత్త్రమ్.

చమ. ౧ విలాసము.

(శ్రీసింగభూపాలుఁడు వైభవమున దేవేంద్రుని ధనుర్విద్యయం దర్జునుని రాజనీతియందు శ్రీకృష్ణుని రూపమున మన్మథుని లోకరంజనమునఁ జంద్రుని జయించుచున్నాఁడు)

ఇట్టివింకను వందలకొలఁది గలవు.

## సర్వజ్ఞబిరుదము

'రసార్ణవసుధాకరాదిగ్రంథకర్త యగుసింగభూపాలునకు సర్వజ్ఞబిరుదము లేదని శృంగారశ్రీనాథము, 209,211, 197 మొదలగుపొరటలలోను, 'రాచకొండ వెలమరాజు'

'సర్వజ్ఞ' బిరుద మందఁగాఁ గొండవీటి రెడ్డిరాజు 'సర్వజ్ఞచక్రవర్తి' బిరుద మందెను. వారు రసార్ణవసుధాకరాదిగ్రంథకర్తలయిరి. వీరు వసంతరాజీయసాహిత్యచింతామణ్యాదిగ్రంథకర్త లయిరి. వారు సంగీతసాహిత్యచతురులు. వీరు సంగీతసాహిత్యచతురులు. వారు కృతిపతులు. వీరు కృతిపతులు. వారు బహుపండితుల నాదరించిరి. వీరు బహుపండితుల నాదరించిరి' అని శృంగారశ్రీనాథము 72 పొరటిలోను బరస్పరవిరుద్ధముగా వ్రాయఁబడి యున్నది. మఱికొందఱు విమర్శకులు గూడ రసార్ణవసుధాకరాదిగ్రంథరచయితకు 'సర్వజ్ఞ' బిరుదములేదని వ్రాసి యున్నారు. కాని సంగీతసుధాకరము నందలి యీక్రిందిశ్లోక మీతనికి 'సర్వజ్ఞ' బిరుదము కల దని యుద్ఘోషించు చున్నది.

శ్లో. అతిగంభీరే విషమే, కతిపయవేద్యేత్విహా గ్రంథే।
సమ్యగ్వ్యాఖ్యాకుశల, స్సర్వజ్ఞస్సింగభూప ఏవైకః.
సంగీతసుధాకరము ౧. ౧౧

* 'సంగీతసుధాకర' కర్తయు, ♦ 'రసార్ణవసుధాకర' కర్తయు

---

* శ్రీమదంధ్రమండలాధీశ్వర ప్రతిగండభైరవ శ్రీఅన్నపోతనరేంద్రనందన భుజబలభీమ శ్రీసింగభూపాల విరచితాయాం సంగీతరత్నాకరటీకాయాం సంగీతసుధాకరాఖ్యాయాం స్వరగతాధ్యాయః ప్రథమస్సమాప్తః. ♦ శ్రీమదంధ్రమండలాధీశ్వర ప్రతిగండభైరవ శ్రీ అన్నపోతనరేంద్రనందన భుజబలభీమ శ్రీసింగభూపాలవిరచితే రసార్ణవసుధాకరనామ్ని నాట్యాలంకారే రంజకోల్లాసో నామ ప్రథమో విలాసః.

నొక్కఁడే. ఇందులకుఁదద్గ్రంథాంతగద్యములుప్రబలసాక్ష్యము నిచ్చుచున్నవి. కావున నే యీవిషయమున విమర్శకు లెవ్వరును వ్యతిరేక భావమును బ్రకటింపలేరు. అమరకోశవ్యాఖ్యా చమత్కారచంద్రికలలోనియీక్రిందిశ్లోకములు గూడ సీతనికి సర్వజ్ఞబిరుద మున్నట్లు సూచించు చున్నవి.

శ్లో. విద్యాదైవత, తాత, తావకగురోస్సర్వజ్ఞచూడామణేః,
స్తోతవ్యోసి;మనీషిణాం త్వమథవా వంద్యోసి, వాక్యైరలమ్
ఇత్థం సింగమహీపతిం గురుజనోప్యాభాషతే దోషవాం
స్తత్తత్పద్ధతిధర్మమర్మణి పరిచ్ఛేదావిసంవాదికమ్.

చమ. ౪ విలా.

శ్లో. జైవాతృకం బుధగురుం నిలయం కళానాం
సర్వజ్ఞమూర్ధమణిమాశ్రితశుద్ధపక్షమ్ ।
శ్రీబొమ్మకంట్యుపపదాంకితమప్పయార్యం
సత్ప్రేషితోషితసురం ద్విజరాజమాహుః.

అమరకోశవ్యాఖ్య.

"ఈశ్లోకమునందలి విశేషణము లన్నియు శ్లేషమహిమచే నప్పయార్యునకును జంద్రునకును సరిపడు చున్నవి. అప్పయార్యునిపక్షమున- సర్వజ్ఞో మూర్ధమణిర్యస్య తమ్- అనువ్యుత్పత్తిచే సర్వజ్ఞబిరుదాంకితుఁ డైనసింగభూపతిప్రామాణికశిరోమణిగాఁ గలవాఁ డనునర్థము 'సర్వజ్ఞమూర్ధమణి' అను పదమునకు సిద్ధించును" అని మామిత్త్రులు శ్రీ చిలుకూరి పాప

య్యశాస్త్రిగారు పరిషత్పత్రికలో వ్రాసియున్నారు. ఈసింగ భూపాలునకు సర్వజ్ఞబిరుదము లేదనువారు సంగీతసుధాకరములోని సింగభూపాలునిశ్లోకమును బట్టియైనను గలదని యంగీకరింపక తప్పదు.

'చంద్రికాపరిణయము'న సర్వజ్ఞసింగభూపతి స్తుతింపఁబడినాఁడు. అందు

గీ. అవనిఁ బొగడొందె సర్వజ్ఞుఁ డనఁగ సింగ
ధరణిభృన్మౌళి తీవ్రప్రతాపహేళి.

అని సర్వజ్ఞబిరుద మున్నట్లుస్పష్టముగాఁ జెప్పఁబడినది. కాని యీసర్వజ్ఞుఁడు రసార్ణవసుధాకరాదిగ్రంథకర్తయో లేక తరువాతివాఁడో నిర్ణయించుటకుఁ దగినయాధార మందుఁ గాన్పింప లేదు. నేను మాత్రమందలియధికతరవర్ణనమునుబట్టి యీసింగభూపాలుఁడే వర్ణింపఁబడినాఁడని యూహించుచున్నాను.

శ్రీనాథుఁడు దర్శించినది యీసర్వజ్ఞసింగభూపాలునే కాని యీతని మనుమఁడగుసర్వజ్ఞసింగభూపాలునిఁ గాదు. ఈతనికి సమకాలికుఁడును బ్రతిస్పర్ధియు నగుపెదకోమటి వేమారెడ్డియాస్థానమున విద్యాధికారిగా నున్నశ్రీనాథుఁడు వేమారెడ్డియనంతర మీప్రభువునే దర్శించె ననుట యుక్తము గాని యీాయనయు నీయనకుమారుఁడును రాజ్యము చేసినపిదప రాజ్యమునకు వచ్చినమనుమనికాలము దాఁక నాఁగి

యాతని దర్శించె ననుట యుక్తిసహము కానేరదు. వేమభూపాలుఁడు మరణింపఁగా శ్రీనాథుఁడు ప్రౌఢదేవరాయలయాస్థానమున కేఁగి డిండిమభట్టారకుని జయించి యక్కడనుండి సర్వజ్ఞ సింగభూపాలునియాస్థానమునకు వచ్చినట్లు — సీ. దీనారటంకాలఁ దీర్థమాడించితి — అను పద్యము సూచించుచున్నది. శృంగారనైషధరచన క్రీ. శ. 1415 ప్రాంతమున జరిగినట్లు శృంగారశ్రీనాథమున నిర్ణయింపఁబడినది. కావున సింగభూపాలదర్శనము శృంగారనైషధరచనమునకును ప్రౌఢదేవరాయల దర్శనమునకును బిమ్మట నల్పకాలముననే జరిగి యుండుటచే — కాశీఖండాదిగ్రంథముల నప్పటికి రచింపలేదు — వానినిమాత్రమే శ్రీనాథుఁ డాపద్యమునఁ జెప్పలేని నాఁడు. ఇదిగాక విద్వాంసుఁడు, కవి, బహుపండితపరివృతుఁడు నగుప్రభువునొద్దకుఁ బోవునపుడే భయపడుట యుక్తము గాని యితరప్రభువునొద్దకుఁ బోవునపుడు భయపడి సరస్వతిని ప్రార్థించుట శ్రీనాథునివంటిమేటివిద్వాంసునకుఁ దగదు. శ్రీ. కోరాడ రామకృష్ణయ్యగారు కూడ నవనాథచరిత్ర పీఠికలో శ్రీనాథుఁడు దర్శించినది యీ సర్వజ్ఞసింగభూపాలునే యని వ్రాసి యున్నారు. కావునఁ బై చర్చవలన శ్రీనాథుఁడు రసార్ణవసుధాకరకర్త యగుసింగభూపాలునే దర్శించెను గాని తత్పౌత్రునిఁ గా దని మనము నిర్ణయింప వచ్చును. కావున,

క. సర్వజ్ఞనామధేయము
శర్వునకే రావుసింగజనపాలునకే
యుర్విం జెల్లును దక్కొరు
సర్వజ్ఞుం డనుట కుక్క సామజ మనుటే.

ఉ. తక్కక రావుసింగవసుధావరుఁ డర్థుల కర్థ మిచ్చుచో
దిక్కుల లేనికర్ణుని దధీచిని ఖేచరు వేల్పుమ్రానిఁ బెం
పెక్కినకామధేనువు శిబిం దుసిని నెన్నెదు భట్టు, దిట్టవై
కుక్కవొ నక్కవో ఫణివొ క్రోఁతివొ పిల్లివొ బూతపిల్లివో.

అనుపద్యము లీసింగభూపాలుని గూర్చియే శ్రీనాథుఁడు చెప్పిన వనుట నిక్కవము. సర్వజ్ఞబిరుద మీప్రభువుదగ్గఱనుండియే వీరివంశస్థులకు సంక్రమించినది

## పోతన సమకాలికుఁడా?

ఈప్రభువునకుఁ బోతన సమకాలికుఁడు కాఁడు. ఈసింగభూపాలునితల్లి అన్నమాంబ. తండ్రి అన్నపోతభూపాలుఁడు. పోతనకవి తనబాల్యమున సర్వజ్ఞసింగభూపతిభోగినిపై రచించిన 'భోగినీదండకము'లో నాసర్వజ్ఞసింగభూపతితల్లి పోచమాంబ యనియును, తండ్రి కుమారాన్నపోతావనీశుఁ డనియును, తాత రావుసింగభూపాలుఁడనియును, సోదరుఁడు వసంతావనీశుఁ డనియును స్పష్టముగాఁ జెప్పియున్నాఁడు. చూడుఁడు. "కుమారాన్నపోతావనీనాథసూనుః ... ... సర్వజ్ఞసింగక్షమా

నాథు... పోచమాంబాలసద్గర్భసంజాతుపై సింగభూపాలుపై ... వసంతావనీనాథసంసేవితాంచత్పదాంభోజు రావుసింగక్షమానాథపౌత్రుఁ... సర్వజ్ఞసింగోర్వరాధ్యక్షు" (భోగినీదండకము) కావున, రసార్ణవసుధాకర రత్నపాంచాలికాదిగ్రంథకర్తయగుసింగభూపాలునకునుబోతనకును నెట్టిసంబంధమును లేదు. ఇట్లే పోతనయును శ్రీనాథుఁడును సమకాలమువారు కారని నేను దలఁచుచున్నాను. వా రిరువురకును సంబంధము కల దని చెప్పుటకై కొందఱు కొన్నికథలను వ్రాసియున్నారు. వానిలో- ఒకనాఁడు శ్రీనాథుఁడు పోతనను సమీపించి 'హాలికులు సుఖముగా నున్నారా' అని పరిహాసపూర్వకముగాఁగుశలప్రశ్నము చేయఁగా నతఁడు

ఉ. బాలరసాలసాలనవపల్లవకోమలకావ్యకన్యకన్
 గూళలకిచ్చియప్పడుపుఁగూడు భుజించుటకంటెఁ సత్కవుల్
 హాలికు లైన నేమి గహనాంతరసీమఁ గందమూలకౌ
 ద్దాలికు లైన నేమి నిజదారసుతోదరపోషణార్థమై.

అని ప్రత్యుత్తరము చెప్పెనని యొకథకలదు. కానియీపద్యము పోతనామాత్యునికన్నఁ బ్రాచీనుఁ డగుమంచనకవి వ్రాసిన 'కేయూరబాహుచరిత్రము' లోనిది. కావున నీకథ కల్పితమే యనుట కభ్యంతరము లేదుగదా! ఇట్లే శ్రీనాథునితోఁ బోతనకు సంబంధము కల దని చెప్పునితరకథలును గల్పితము లని

మనము నమ్మవచ్చును. మఱియును శ్రీనాథుని కవిత్వమును బోతన బహుస్థలములలో ననుకరించినాఁడు.

సీ. శ్రీభీమనాయకశివనామధేయంబుఁ
జింతింప నేర్చినజిహ్వ జిహ్వ
దక్షవాటీపురాధ్యక్షమోహనమూర్తిఁ
జూడంగ నేర్చినచూపు చూపు
దక్షిణాంబుధితటస్థాయిపావనకీర్తి
చే నింప నేర్చినచెవులు చెవులు
తారకబ్రహ్మవిద్యాదాతపాదాలఁ
విరులు పూయంగ నేర్చుకరము కరము
గీ. ధవళకరశేఖరునకుఁ బ్రదక్షిణంబు
నర్థిఁ దిరుగంగ నేర్చినయడుగు లడుగు
లంబికానాయకధ్యానహర్షజలధి
మధ్యమునఁ దేలియాడెడుమనసు మనసు.

భీమఖండము. 3. ౧౯౮.

సీ. కమలాక్షు నర్చించుకరములు కరములు
శ్రీనాథు వర్ణించుజిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచుచూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కుశిరము శిరము
విష్ణు నాకర్ణించువీనులు వీనులు
మధువైరిఁ దవిలినమనము మనము

భగవంతు వలగొనుపదములు పదములు
పురుషోత్తమునిమీఁదిబుద్ధి బుద్ధి
గీ. దేవదేవునిఁ జింతించుదినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించుచదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడిగురుఁడు గురుఁడు
తండ్రి, హరిఁ జేరు మనియెడితండ్రి తండ్రి.

భాగ. ౭. ౧౬౯.

శ్లేష, ఉ. స్నానము చేసి ధౌతపరిధానము గట్టి ... హర. ౨. 3౭. లోని శ్రీనాథునితద్భవవ్యాజయతినే, సీ. తరుణికి మంగళ స్నానంబు సేయింత మని ... భాగ. ౮. ౨౭౦. లోఁ బోతనామాత్యుఁడుగూడ నుపయోగించి యున్నాఁడు. శ్రీనాథపోతనలను గూర్చి ప్రత్యేకముగా నొకగ్రంథము వ్రాయఁ దలఁచి యుంటిని గాన నిఁక నీవిషయము విరమించు చున్నాను.

## ఆంధ్రీకరణము

ఈనాటికి రసవత్తరమై రత్నావళీప్రియదర్శికా దినాటికలను బోలియున్నది. ఇందలిశ్లోకము లెల్ల నమృతరసగుళికలు. చిన్నచిన్నయర్థశబ్దశ్లేషల సాయమున గొప్పచమత్కారమును సంపాదించుటయందును, ఆశ్లేషలరసవత్తర సంభాషణాంగము బాగా జేసికొనుటయందును నీకవికిఁ గల నైపుణ్యము స్తవనీయము. ప్రథమ ద్వితీయాంకములలోని - మాధవ, అపరాగ-

శ్లేషఘట్టము లిందులకు మంచి యుదాహరణములు. ఇందుఁ గాళిదాసహర్షాదులయనుకరణము గొంత యున్నను నుపజ్ఞకు లోటు లేదు. ఈపొత్తము ననంతశయనసంస్కృతగ్రంథ మండలివారు ప్రకటించియున్నారు. అందుఁ గొన్ని తావు లలోఁ బ్రమాదములు కలవు. వానిని యథామతి పరిశోధించి యీగ్రంథము నాంధ్రీకరించి యస్మత్కులదైవ మగు శ్రీతిరు పతివేంకటేశ్వరస్వామికి సుభానుమాఘశుక్ల తృతీయాగురువాస రమునాఁడు సమర్పించియున్నాను.

ఇట్లు
సుధీవిధేయుఁడు,
పిసుపాటి, విశ్వేశ్వరశాస్త్రి

నెల్లూరు
20—5—47

శ్రీ

# రత్నపాంచాలిక



(నాంది)

గీ. సరస శృంగార వీర సౌజన్యయుతము
మాధ్వ్య వైయాత్య సౌహార్ద మంజులంబు
లాస్య తాండవ సౌహృద లాలితంబు
నైన దాంపత్యము భజింతు మహరహంబు.

మఱియును.

మ. స్మరణప్రక్రియ నుప్తిఁ గాంచి; ప్రణయో
ష్మన్ మొల్చి; కేల్గేల్ పర
స్పరముం గూర్పఁగఁ బల్లవాప్తిఁ గని; వి
స్రంభంబునన్ సూనసుం
దర మై; యైక్యమునన్ ఫలించినయప
ర్ణాశంకర్యాసందని
ర్జరభూజంబు ధరిత్రి మీ కిడుత మ
శ్రాంతంబుఁ గల్యాణముల్.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు:—(ప్రవేశించి) సకలసౌభాగ్యభాసురభవనం బై, యమరావతీవిభవవిలాసరేఖలకు మణిదర్పణంబై, యువనిసురు లనవరతము పొనరించుక్రతువితతిం బొడముధూమరేఖలనెపంబున గగనలక్ష్మీగండమండలి లిఖింపంబడుకస్తూరీపత్త్రభంగంబుల విలసితంబై, యభంగవిహారమాణవీరభటకోటులకనకకేయూరకోటులరాయిడి రాలుసువర్ణరజఃపుంజంబునఁ బింజరితంబు లగురాచబాటల వాటం బై, యనంగపునరుజ్జీవనప్రసంగమంగళంబున నాయతనారంభవిరచితనవకువలయతోరణశ్రీ విడంబించుతరళతరాపాంగంబుల మించువారవిలాసినీజనంబుల విరాజమానం బై, "రాచకొండ" యనుపేర వెలయురాజధాని నధివసించిన "ప్రసన్నగోపాల" దేవునివసంతయాత్రామహోత్సవంబున సకల దిగంత సమాగతనాగరకరాజసభాజనులసభాజనపురస్సరాదేశమున—లలితకవితావిలాసచతురాననుండును, జతురుదధివలయితవసుంధరాపరిణాహంబున నెల్లెడల మెండుకొనుకీర్తికర్పూరపూరంబునఁ బరిహసితాన్యరాజన్యగుణగౌరవుండును, బ్రతిగండభైరవుండును, భారతీలక్ష్మీసరస్వతీపరస్పరవిరోధపరివాదపరిహారణంబునం బ్రవీణంబు లైననిజగుణంబులఁ దరంగితాంతరంగు లగువిద్వజ్జనులయాదరణంబునం బరాయణుండును, ఖడ్గనారాయణుండును,

మాన్యమహిళాగుణవిశేషంబులకుఁగ్రీడాగృహంబై*"యన్న మాంబిక" యన వెలయువిదూరభూమికి విమలరత్నకందళంబును, శ్రీమంతుఁడును నగు "శ్రీ సింగభూపాలుండు" నిర్మించినదియు, నఖండపరమానందవస్తుచమత్కారిణియు నైన "కువలయావలి" యను ప్రసిద్ధసంస్కృతనాటికను మున్ను మాపెద్దలు ప్రదర్శించియుండిరని వినియున్న యాంధ్రరసజ్ఞశేఖరులు నేఁడు సగౌరవముగా నాకిటు లానతిచ్చిరి.

"రంగలక్ష్మినివాసా, మామిత్త్రులు విశ్వేశ్వరశాస్త్రిగారు కువలయావలీనాటిక కాంధ్రమున రచియించినయనువాదమును బ్రయోగించి మాకానందముఁ గలిగింపు"మని.

(అనుసంధానగౌరవముతో)

గీ. [illegible]ని విశ్వేశ్వరసరస్వతి వినుతింప
సిద్ధముగ నున్నదో యట్టి సింగధరణి
విభునిసాహిత్యసౌభాగ్యవిలసనంబు
గాదొకో లోకవిస్మయాపాదకంబు ?

---

* ఇట మూలమున — ఉమాంబిక — అని కలదు. అది ముద్రాక్షర ప్రమాదము కావచ్చును. ఈసింగభూపాలునితల్లి "అన్నమాంబ"అని రసార్ణవసుధాకరము. ౧. ౫౮, ౫౯. శ్లోకములలో నీతఁడే స్పష్టముగాఁ జెప్పికొని యున్నాఁడు.

(సంతోషముతో)

మ. అతనుం గన్నయదూద్వహుండు పతి; నా
ట్యాలంక్రియాకల్పనా
ప్రతిమానుం డనపోతసింగధరణీ
పాలుండు నిర్మాత; ప్రా
జ్ఞతముల్ నేటిసభాసదుల్ రసకళా
సామ్రాజ్యసంజీవనుల్;
కృతమన్నాట్యకృషుల్ పురాకృతశుభ
శ్రీఁ బండె నీనాఁటికిన్.

(నేపథ్యాభిముఖముగాఁ జూచి)

ఆర్యా, ఇంకను విలంబ మేల ?

నటి:—(ప్రవేశించి సవినయముగా) ఆర్యపుత్రా, నేపథ్యసా
మగ్రి సిద్ధపఱిచితిని. అనంతరకరణీయము సెలవిమ్ము.

సూత్ర:—గీ. అతివ, రుక్మిణీసత్యభామాదిపరివృ
తపురుషోత్తమయును రసోత్తరయు నైన
కువలయావలి దర్శించుకోర్కి మిగుల
నుత్కలిక నొందుచున్న దీయోలగంబు.

కావున వేషములు ధరింపుఁడు.

నటి:—ఆర్యపుత్రా, మీచిత్తము ననువర్తించుటకన్న నాకుఁ
గార్యాంతర మే మున్నది ?

సూత్ర:—సెబాసు. కల్యాణశీలా, సెబాసు.

క. స్తుతితతి కర్హ్వము లితర
వ్రతములు వే యుండఁగాక వసుధాస్థలిలోఁ
బతిచిత్తరంజనంబే
సతులకుఁ బరమవ్రతంబు సద్గుణనిలయా,

(నేపథ్యమున)

సఖులారా, విన్నారుగదా స్త్రీపురుషార్థసారము లగునీ పలుకులు !

సూత్ర:—(సంతోషముతో) కలికీ, కాలయవనుని జయింప నేఁగిన వాసుదేవునభ్యుదయమునకై సౌభాగ్యలక్ష్మీప్రద మగుసువాసినీపూజ గావింప విలాసోద్యానమునఁ జేరిన రుక్మిణీప్రముఖదేవీజనము సపరిజనముగా నిటే వచ్చుచున్నది. కావున మనము దూరముగాఁ దొలఁగిపోదము. రమ్ము.

(ఇరువురు నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన

శ్రీ

# రత్నపాంచాలిక

## ప్రథమాంకము

---

(తగుపరిజనముతో దేవీజనము ప్రవేశించును)

రుక్మిణి:—సఖులారా, వింటిరుగదా స్త్రీపురుషార్థసారము లగునీపలుకులు !

ఇతరలు:—మహాదేవీ, వింటిమి. తెలిసికొంటిమి. ఇవి మాటిమాటికి విన దగి యున్నవి.

రుక్మిణి:—(స్మరించుకొని, హర్షముతో) సఖులారా, ఈపలుకులు మున్ను నారదమహర్షి గూడ లక్ష్మి కుపదేశించి యున్నాడు.

జాంబవతి:—మహాదేవీ, అటువంటికన్యకను మనయంతిపురమున నిల్లడపెట్టి వరాన్వేషణమున కేఁగినకలహప్రియుఁడగునామహర్షి యిప్పుడు మరల వచ్చినాఁడుగదా !

రుక్మిణి:—ఔను,

కాళింది:—దేవీ, ఆఁడువారికంటి కాఁడుదిగాను మగవారి కంటికి రత్నపాంచాలికగాను గనఁబడు నని మేము విని యున్నయింతి యీకన్యకయా?

రుక్మిణి:—ఔను. చెల్లెలా, ఔను.

సత్యభామ:—(తనలో) పాపము రుక్మిణి అమాయికురాలు ఏమియు నెఱుఁగదు. ఆర్యపుత్రునిమనోరంజనముకొఱకే యెల్లప్పుడుఁ బాటుపడునాదేవర్షి కపటనాటకనిర్వాహణసూత్రధారుఁడుగదా! అందువలన నాగుండె లదరుచున్నవి.

మిత్రవింద:—దేవీ, ఆదేవర్షివలన నార్యపుత్రునివృత్తాంత మేమియును దెలియ లేదా? ఆకలహప్రియుఁడు త్రిలోకములు సంచరించు చుండునుగదా!

రుక్మిణి:—సఖులారా, శుభవార్త వినుఁడు. ఆర్యపుత్రుఁడా మహాసురుని సంహరించినాఁడు.

ఇతరులు:—సంతోషము. సంతోషము.

లక్షణ:—దేవీ, మఱి, ఆర్యపుత్రుఁడు వెంటనే రాక యక్కడనే యేల మసలుచున్నాఁడు?

రుక్మిణి:—సఖీ, బ్రహ్మాదిదేవతలు విమానముమీఁద నందనవనమునకు వేంచేసినా రని విజయవార్తతోపాటు నారదుల వారు నాకు సెలవిచ్చినారు.

సత్య:—అట్లైన నార్యపుత్రుఁ డీప్రభాతమున మననగరము నలంకరించును.

రుక్మిణి:—ఔను.

(దివ్యరథముతో శ్రీకృష్ణుఁడు మాతలి ప్రవేశింతురు.)

శ్రీకృ:—ఆర్యా, మాతలీ, భగవానుఁడు దేవేంద్రుఁడు చేసిన గౌరవముచే నేను కృతార్థుఁడ నైతిని.

మాతలి:—దేవా, ఇట్లన నేల? భగవానుఁడు పాకశాసనుఁడు దివ్యసింహాసనమున సుస్థిరముగా నున్నది మీయనుగ్రహమువలననే గదా!

శ్రీకృ:—ఇదే గదా వైదర్భీవిలాసోద్యానము! కావున నిక్కడ దిగెదను (దిగి) మాతలీ, సుఖముగా నేఁగుము.

మాతలి:—చిత్తము. (దివ్యరథముతో నిష్క్రమించును.)

సుశీల:—మహాదేవి. ఇప్పు డాకన్యక యెక్కడ నున్నది?

రుక్మిణి:—సఖీ, నాయనుమతి గైకొని యిప్పుడే యుద్యానవనలక్ష్మిని వీక్షింప నేఁగినది.

సత్య:—(ప్రణయోపాలంభములతో) అక్కా, నీవు కేవలము ముగ్ధవు సుమా! కనుకనే పరిచితము లగు కాని నికుంజప్రదేశములలోఁ బరకీయదారికను ద్రిప్పుచున్నావు.

ఇతరలు:—నిజమే.

రుక్మిణి:—(అంగీకారముతో) సఖులారా, రండు. ఆకన్నెను బిలిపించి సువాసినీపూజ గావింతము.

(దేవీజనముతో రుక్మిణి నిష్క్రమించును)

శ్రీకృ:—(కొంచెము బిగ్గరగా) ఎవ రిక్కడ?

వనపాలిక:—(ప్రవేశించి, నమస్కరించి) చిత్తము దొరా,

శ్రీకృ:—సహకారికా, ఈయుద్యానములోనిపువ్వులు చివుళ్లు నింతవఱకుఁ గోయలేదేమి ?

సహ:—దేవరవారివిజయమంగళవార్తను విని యిక్కడకే వచ్చి యున్నరాణులు తమచేతులతోఁ గోసినపూలగుత్తులతో సువాసినీపూజ చేయవలెనని.

శ్రీకృ:—ఔరా మాకుఁ గళ్యాణపరంపరను జేకూర్చుటకై దేవేరు లెంత శ్రమపడ నున్నారు! కావునఁ దటాలున నగపడి హర్షవినయలజ్జాసంభ్రమములతోఁ గూడినరాణుల విలాసము ననుభవింతును. మారాకను నీవు ముందుగా వారికిఁ దెలుపకుము. శ్రీవత్సునకు మాత్రము చెవిలోఁ జెప్పి వాని నిక్కడకుఁ బంపుము.

సహ:—చిత్తము దొరా, (నిష్క్రమించును.)

శ్రీకృ:—(తహతహతో)

గీ. ఒక్కతావునసే చేరియున్నయది సు
జాతమై యున్నయది యతిస్వచ్ఛభావ
మొలసి యున్నది యైనరత్నౌఘ మట్లు
నాకు రాణులబృంద మానంద మొసఁగు.

(ఎదుటఁ జూచి) ఔరా విలాసోద్యానరామణీయకవిలాసము !

గీ. సరససహకారపల్లవాస్వాదమధుర
కంఠనాళంబు లగుకలకంఠతతుల
రుతులను బరస్పరము దరులతిక లిచట
ముచ్చటించుచు సుఖపడుపోల్కి నెసఁగు.

(పరికించి) ఓహో! ఇది కోకిలాలాపము గాదు. ఎవరో యిరువురుకన్యకలసల్లాపము.

(చంద్రలేఖ కువలయావలియుఁ బ్రవేశింతురు.)

చంద్ర:—చెలీ, ఇటు. ఇటు.

శ్రీకృ:—(ఆశ్చర్యముతో) ఏమిది? చంద్రలేఖ విదగ్ధ యైనను ముగ్ధవలె రత్నపాంచాలికతో మాటలాడుచున్నది.

కువల:—సఖీ, చంద్రలేఖా, అకృత్రిమ మగునీస్నేహమున నామనసు తనిసినది.

చంద్ర:—చెలీ, సహజ మగుకువలయావలీచంద్రలేఖలస్నేహానుబంధము శ్లాఘనీయము గదా!

శ్రీకృ:—

గీ. కనుల కిది రత్నపాంచాలిక గనె తోఁచు;
మధురసల్లాప మనుననుమానమునను
'కాదు కా దిది' యనునిమ్మికయును గల్గు;
నీవిచిత్రంబునకు హేతు వేమి యొక్కొ?

చంద్ర:—(కువలయావలిని నిదానించి చూచి) చెలీ, నారదులవా రంతిపురమునకు నిన్నుఁ దెచ్చి పట్టమహిషులసౌభాగ్యగర్వము తొలఁగించినారు.

కువల:—(ప్రణయాసూయలతో) సఖీ, అది యెట్లు ?

చంద్ర:—ఆ దేవర్షి కన్యారత్నమును నిన్నుఁ ద్రిభువనైక మల్లుఁ డగుక్షత్త్రియకుమారునకు హృదయాలంకారము గాఁ జేయ సంకల్పింపఁ డేని మాణిక్యమును మందసమున నుంచిన ట్లంతిపురమున నుంచునా ?

శ్రీకృ:—ఏమి ! ఈకన్యారత్నము క్షత్త్రాణ్యయా ? కానిచో నీమధురవాణిని భగవానుఁడు విరించినందనుఁడు మారాణి వాసమున నె ట్లుంచును ? (ఆలోచించి) మఱి, యిది యేమి? ఈయింతి మాకన్నులకు రత్నపాంచాలిక గానే కనఁబడు చున్నది.

కువల:—సఖీ, నీ వేమి చెప్పినను నేను మాత్రము చతురభాషిణి వగునీయభిప్రాయమును గ్రహింపఁ జాల కున్నాను.

చంద్ర:—చెలీ, నవయౌవనసహకారి మన్మథభగవానుఁడే సర్వమును గ్రహింపఁజేయును.

శ్రీకృ:—

గీ. లక్షితాకృతి గానియీాలలన చేటి
కాలపనసూచితౌదార్యమై *పరీమ
ళపిదితవిశేష కేతకలతికవోలె
నాఁచికొనుచున్నయది సుమ్ము నామనమ్ము.

* పరిమళః, పరీమళః:—"మల"ధారణే, మల్యతే, కర్మణిఘఞ్. సంజ్ఞాపూర్వకత్వా ద్వృద్ధ్యభావః. సూ. ఉపసర్గస్య ఘఞ్యమనుష్యే బహులమ్. ఇతి వా దీర్ఘః (చూ. అమరసుధ)

చంద్ర:—చెలీ, మదనరాజ్యసంజీవని వగునిన్నుఁ జూచుటకో యన నిట నవతరించినవిలాసోద్యానమాధవుని శ్రీ విలోకింపుము.

కువల:—(లజ్జాకౌతుకములతో) సఖీ, ఈపొదరింట దాఁగి యుండి విజయయాత్రనుండి యేతెంచినరుక్మిణీవల్లభుని విలోకింతము. రమ్ము.

చంద్ర:—(తనలో) ఓహో! ఈమె నామసాదృశ్యమున మోస పోయిన ట్లున్నది. కానిమ్ము. ఈమె ననుసరించి వినోద పెట్టెదను. (ప్రకాశముగా) నెచ్చెలీ, నీయిష్టము. (అట్లు చేయుదురు)

కువల:—(తహతహతోఁ జూచి) సఖీ, ఆమహానుభావుఁ డేఁడీ?

చంద్ర:—చెలీ, 'మాధవుఁ డెదుటనే యున్నాఁ' డని చెప్పుచు న్నానుగదా! కావున నన్యచింత వదలి యీతనిఁ జూడుము.

శ్రీకృ:—(శంకావిమర్శములతో) నే నిక్కడ నిగూఢముగానే యున్నాను. ఐనను జతురురాలైన యీచేటి నన్నుఁ గని పట్టి యుండ లేదుగదా!

కువల:—(మరలఁ జూచి విషాదముతో) సఖీ, 'ఎదుటనే యున్నాఁ' డని నీ వనుచున్నయాయదుకులశేఖరుఁడు మాధవుఁ డేఁడీ?

చంద్ర:—చెలీ, నీ వనుకొన్నయదుకులశేఖరుఁడు మాధవుఁ

డెక్కడ నున్నాఁడో యెఱుఁగను. నేఁ జెప్పినబుుతుకుల శేఖరుఁడు మాధవుఁడు మాత్ర ముద్యానములో నంతట నగపడుచున్నాఁడు.

శ్రీకృ:—బలే! చంద్రలేఖా, బలే!

గీ. కల్పితాపూర్వభాషణానల్పసంవి
ధానమునఁ దరంగితచమత్కార వైన
నీకు బుుణపడియున్నాఁడ నీలవేణి,
పారితోషిక మీఁ లేనికారణమున.

కువల:—చెలీ, ఈవిధముగా నీవు నన్ను మోసగించినావు.

చంద్ర:—చెలీ, నేను గాదు. అర్థాంతరమునం దభినివేశము గలిగి నిన్ను నీవే మోసగించుకొన్నావు.

కువల:—సఖీ, నీవు నెచ్చెలులనే వంచించుదానవు. ఇదె నీచెలిమి వదలివేయుచున్నాను.

(ఒకయడు గావలకుఁ బోయి నిలుచును.)

చంద్ర:—(చిటికెనవ్రేలు పట్టుకొని) చెలీ, నర్మకేళికిఁ గోపగింపకుము.

(కువలయావలి బలవంతముగా వ్రేలు లాగికొని మరల నింకొకయడు గావలకుఁ బోయి నిలుచును.)

చంద్ర:—(తనలో) ఈమెకు గట్టిగాఁ గోపమువచ్చినది. కనుకనే మణిముద్రిక జాఱిపోయినను దెలిసికొన లేదు. ఈమెను బట్టుకొని యాఁపెదను. (అట్లు చేయును)

శ్రీకృ:—(ఆశ్చర్యముతో)

ఆ. వె. కంటి నెఱుఁగనీనికారణము తలఁగాన
నోరసిలఁగ సీమిటారిమిన్న
ఒఱను బాయఁ బెట్టిన మరుఁడు చేఁబూనిన
కఱకుఁజురకటారికరణిఁ దోఁచు.

ఆహా! మాయనుసరణవ్యాపారము ఫలించినది.

గీ. పంచబాణువిజంగమవై జయంతి
కరణిఁ; బ్రత్యక్షమగురతికాంతునియధి
దేవతవలె; జగజ్జనదృష్టిమూర్త
భాగ్యరేఖయుఁ బోలెఁ గన్పడుఁ గృశాంగి.

(చాలసేపు పరికించి చూచి) ఈయువతి సామాన్యస్త్రీ గాదు.

గీ. విరిలకోరీదునేదారియరిదిసిరియొ?
మోహనకళావిలాసైకమూర్తి యొక్కొ?
సుభగతాకందళియొ? పెక్కుసూక్తు లేల?
యతివ మన్నేత్రభాగ్యదేవతయె సుమ్ము.

(ఆలోచించి) అన్యోన్యవిశ్వాసము కలిగినయాలతాంగుల కగపడెదను. (అట్లు చేయును. చంద్రలేఖ శ్రీకృష్ణునిఁ జూచి హర్షసంభ్రమములతో నమస్కరించును)

శ్రీకృ:—(అనుగ్రహముతో) చంద్రలేఖా, అంతఃపురచారిణులకు సేమమా?

చంద్ర:— విజయలక్ష్మీవల్లభు లగుదేవరవారిపాదారవిందసందర్శనమున నేఁడు సేమము.

కువల:—(చూచి తనలో) ఔరా యదువల్లభునిసౌందర్యవిశేషము! (అనురాగముతో సవిమర్శముగాఁ జూచి) ఆకృతి విశేష మతిమాత్రసమ్మోహనము. (చూచు చుండును)

చంద్ర:—(కువలయావలియాశయము తెలిసికొని తనలో) ఓహో! ఈమె యేలినవారిమీఁదఁ గన్నువేసినది. పోనీ, చంద్రికకుఁ జంద్రునిమీఁద ననురాగము తగును గదా!

కువల:—సఖీ, దేవిగారిదగ్గఱకుఁ బోదము. రా. (సఖిని లాగును)

చంద్ర:—చెలీ, ఏలినవారిసెలవు లేకుండ నెట్లు రాఁగలను? కనుక నీ మెకు సెల విం' డని యేలినవారికి విన్నవింపుము

కువల:—(కృత్రిమసంరంభముతో రెండు మూఁడడుగులు నడచి యడుగులతడఁబాటు నభినయించి తనలో) ఓహో! నాయడుగు లిటు సాగుట లేదు. (వెనుకకుఁ దిరిగి ప్రకాశముగా) సఖీ, ఈయవినయమును మఱచిపోకుము. రాణిగారికి విన్నవింతును.

చంద్ర:—చెలీ, మఱచిపోనులే. నీవు పో.

కువల:—సఖీ, రా. (వినయముతో సఖిని లాగును)

శ్రీకృ:—(తనలో)

క. ప్రకటతిక్షణరోషవినయ
యకథితకథనాభిసూచితాశయ యీక
న్యక యిట విస్రంభకథా
సుకృతనిబద్ధ మగునదికి సుఖము ఘటించున్.

(ప్రకాశముగా) చంద్రలేఖా, మీమాధవశ్రీవిలోకనము నకు విఘ్నము రాఁగూడదు. కనుక మేము వెడలిపోయెదము.

చంద్ర:—(జనాంతికముగా) చెలీ, ఉద్యానమునఁ దీఁగలచాటున నున్నయేలినవారు మనవిస్రంభసంవాదము విననే విన్నారుసుమా!

కువల:—(అసూయతో) సఖీ, నీశ్లిష్టసంవాదము నన్ను మిగులఁ జులుకనచేసినది.

చంద్ర:—ఔను, నీపరిస్ఖలితసంవాదము నన్నుఁ గూడ మిగులఁ జులుకనచేసినది.

కువల:—(సిగ్గుతోఁ దలవంచుకొని ముసిముసినవ్వులు నవ్వుచుండును)

(నేపథ్యమున)

చెలీ, చంద్రలేఖా, 'వనసంచారముతోఁ గువలయావలి నెంతసేపు శ్రమపెట్టెద' వని రాణిగారు కోపపడుచున్నారు. కనుక నామెను దీసికొని రా. (అందఱు విందురు.)

చంద్ర:— మహాప్రభూ, మాకు సెలవు దయచేయుఁడు.

శ్రీకృ:—కళ్యాణీ, మరలఁ గలిసికొందము గాక.

(కువలయావలీచంద్రలేఖలు భయసంభ్రమములతో నిష్క్రమింతురు.)

శ్రీకృ:—(చూచి) ఏమిది ? పచ్చిక లేనిచోటఁ గూడ నీపెంపుడుజింక పచ్చిక మేయఁ జూచుచున్నది. (నిరూపించి) ఓహో ! ఇది మరకతమణిముద్రిక. (తీసికొని పరిశీలించి చూచి యాశ్చర్యముతో) ఏమిది ? ఇందు మణినడుమ ఛాయాచ్ఛలమున నక్షరపంక్తు లున్నవి.

గీ. కేల మణిముద్రఁ దాల్చి యీబాల పూరు
షులకుఁ బాంచాలికాభ్రాంతిఁ గలుగఁజేయు
క్షితిని నీయుంగుళీయ మీక్షించునాతఁ
డేతదుద్వాహమంగళ మెనయఁగలఁడు.

(ఆలోచించి)

క. ఆవామనయన దీనిప్ర,
భావముననె యట్లు రత్నపాంచాలిక యై
భావమును భ్రాంతిరూపము
నావేళను గూర్చె మామకాక్షియుగళికిన్.

దీనిని వెదకుటకై తప్పక కువలయావలి చంద్రలేఖతోఁ గూడ నిక్కడకు మరల వచ్చును. కనుక నొకముహూర్తకాల మిక్కడనే పొంచి యుండి తదాగమనమునకై నిరీక్షింతును. (నిష్క్రమించును)

ఇది ప్రథమాంకము.

---

శ్రీ

# రత్నపాంచాలిక



## ద్వితీయాంకము.

(విదూషకుఁడు ప్రవేశించును.)

'నాయాగమనవార్తను గుప్తముగా నుంపు' మని ప్రియవయస్యుఁడు చెప్పంపినాఁడు. అట్లే దానిని దాఁచుచుండ వాయుపూరితమైనట్లు నాకడు పుబ్బిపోవుచున్నది. కావున విజనమైనయీవిలాసోద్యానమున నాయానందప్రవాహము వెల్లివిరియఁజేయుదును.

బళిబళీ! ప్రియవయస్యుఁడు జయించినాఁడు. మా భాగ్యము పండినది. విజయలక్ష్మీప్రియసఖుఁడు వయస్యుఁడు విలాసోద్యానమందిరమున నేఁడు విలసిల్లుచున్నాఁడు. (సంతోషమున నర్తించుచు సంశయమున విరమించి) ఔరా మంత్రరక్షణమున నాబుద్ధి యెంత ప్రమాదపడినది! అంతిపురముపరిచారికలు మెలఁగునీయుద్యానమున గుట్టు నిట్టు బట్టబయలు చేయుచున్నాను. (చూచి) అదిగో ప్రియవయస్యుఁడు. సమీపింతును.

శ్రీకృష్ణుఁడు:—(ప్రవేశించి ముద్రికను జూచుచు)

క. స్మరరాజ్యముద్ర యగుసుం
దరిలావణ్యముఁ దిరోహితము సేసితి ; వా
దురితంబున నోముద్రా,
బెరసితి విబ్భ్రంగి స్వపదవిభ్రంశంబున్.

విదూ:—(సమీపించి) విజయలక్ష్మిఁ జేపట్టి ప్రియవయస్యుఁడు వర్ధిల్లు చున్నాఁడు.

శ్రీకృ:—(చూచి) మిత్త్రమా, కుశలమా ?

విదూ:—ఇప్పుడు. ప్రియవయస్యముఖారవిందసందర్శనమున నేఁడు నాకు సుదినము.

శ్రీకృ —మిత్త్రమా, శ్రీవత్సా,

ఆ. వె. ఇచటి కాలసించి యేతెంచితివి గాన
పరశరీరఁ బ్రసవశరవికాస
దేవత యగుకన్యఁ దిలకింప వైతివి
కన్ను లున్నఫలముఁ గాన వైతి.

శ్రీవ:—(కౌతుకముతో) నేఁడు నీ కక్కడఁ గనఁబడినదా ?

శ్రీకృ:—ఔను. మిత్త్రమా, ఎప్పటి కైనను నీ వాసుందరిని దర్శింపఁగలవు. కనుక నాయనుభవమునే నీకుఁ దెలిపెదను.

చ. అతివనితంబ మంగజుర
థాంగము బింబముచే హసించు ; హ
స్తతలమితంబు మధ్యము స
దా త్రివళీపరిణద్ధ ; మాక్రమాం

కితనికటం బురోజయుగి
గీలిత మైనటు లొప్పు; నైజలో
లత చెలువారఁ జేరలకొ
లందు లగుఙ్ లలితాంగినేత్రముల్.

శ్రీవ:— ఔరా జవ్వనపునిండుఁదనము!

శ్రీకృ:—మిత్త్రమా, తెలియనివస్తువు నితరులకుఁ దెలుపునది యుపమానములచేఁ గదా! నిరవద్య మగునుపమానమే యీరమణికి దుర్లభము.

సీ. నలినంబు కర్దమనిలయంబు సామజ
కరము లాశైవకర్కశములు
పుంస్కోకిలాలాపములు వాయసక్రూర
శిక్షణసంప్రాప్తరూక్షణములు
వాలుగమీలకుఁ బాయకుండును జడ
సాంగత్య మది యెట్టిసమయమునను
కైరవిణీచిత్తచోరునిపరిపూర్ణ
భావంబు దలపోయఁ బాక్షికంబు
ఆ. వె. కనుకఁ జంచలాక్షి తనసుందరావయ
వములకు నుపమానవస్తు వొకటఁ
డేని పొందఁ నేర దెచట గాలించిన
నని తలంతు నేను మనమునందు.

శ్రీవ:—(తనలో) ఔరా! ప్రియవయస్యునకుఁ గ్రొత్తగాఁ గనిపించినపడుచుమీఁద వలపు మిక్కుటముగా నున్నది. కనుక సందియ్యేను. (ప్రకాశముగా) ఔనయ్యా, 'రాజులు నూతనప్రియు' లనుప్రవాద మిప్పుడు నిజమైనది. కనుకనే సకలగుణశ్లాఘనీయ మగురాణివాసము నవమానించి యెవతెనో యొకపడుచును బొగడుచున్నావు. పోనీ, ఇది ప్రసిద్ధమేగదా!

గీ. ఒక్కయెడ గుణ ముండు; వేఱొక్కయెడను
ప్రభులచిత్తంబు రమియించుఁ; బద్మమందు
రాగము పరిత్యజించి యారాజు కుముద
మందు ననురాగము వహించి యలరుఁ గాదె!

శ్రీకృ:—మిత్త్రమా, వివేకవంతులకు వస్తుగుణవిశేషము సౌహార్దము గలిగించును.

శ్రీవ: నీకు వివేకము బొత్తిగాఁ బోయినదని చిరకాలముగా మాసి యంటలు గట్టి జిడ్డుపట్టినకొప్పులు త్రిప్పుకొను గొల్లయిల్లాండ్రతోడిచౌర్యసంబంధమునఁ దెలియనే తెలిసినది.

శ్రీకృ:—మిత్త్రమా, మాతలపులపోల్ల మగునీకలికి సౌందర్యమున రాణులతో సరితూఁగదనియా నీయాశయము?

శ్రీవ:—ఔను. ప్రియవయస్యుఁడు వ్యాఖ్యానించినట్లే.

శ్రీకృ:— ఆయింతిలావణ్యము సర్వాతిశాయి. దానిని గన్నులారఁ జూడనినీవు నీకుఁ దగినది పలుకు చున్నావు. పలు పలుకు లేల ? వినుము.

మ. చలితాపాంగదృగుత్పలవ్రజముఁ జం
చచ్చంచలభ్రూర్మి సం
కలితశ్రీగళశంఖముఁ గుచరథాం
గద్వంద్వమున్ గాఁగఁ బై
దలిలావణ్యసుధాసరస్సు వెలయున్;
దద్బిందువుల్ గొన్ని చెం
తలఁ జిందన్ విధి యన్యకాంతలజిగిన్
గావించె నబ్బిందులన్.

శ్రీవ:—(విశ్వాసాదరములతో)

గీ. అఖిలలక్షణలక్షిత యైనవేల
కొలఁదిరాణివాసంబులకును బ్రియుండ
విట్టినీమది గిలుబాడినట్టిలలన
యరయఁగ నన ర్ఘమాణిక్య మగును గాదె !

ఇఁక నీయందా మెదృష్టివిశేష మెట్లున్నది ?

శ్రీకృ:-

క. తనరెఁ ద్రపామదనులచేఁ
వనజాయతపత్త్రనేత్రవలపు ప్రతీతం

బును సప్రతీతముని *గా
కను దీపమువోలె యవనికాదీప్తులచేన్.

అప్పుడు.

మ. ప్రతిపీఠీకుతుకంబు లైనను ప్రపా
భారంబునన్ మందముల్
వితతవ్యాజవిసారితంబు లయినన్
భీత్యాకులంబుల్ సము
ద్గతసంవాదవివర్తితంబులు వెసన్
గంభీరదృష్టంబు లిం
గితకర్ణేజపముల్ కొనె న్నను మృగా
క్షీవీక్షణంబుల్ సఖా,

శ్రీవ:—వయస్యా, ఇట్టిది యభిలాష ! ఇంక నీ వాయింతి నుపేక్షింప నేల ?

శ్రీకృ:—ఆరమణిని నారదులవారు వైదర్భియొద్ద నిలుపఁడ వెట్టినారు. కావున వైదర్భీవశమున నున్నది.

శ్రీవ:—అనైన నీయింతిమీఁదనీవాంఛ పన్నగీఫణామణిమీఁది వాంఛవలె సిద్ధింప దని నాతలఁపు.

శ్రీకృ:—(నిట్టూర్పుతో) మిత్త్రమా, శ్రీవత్సా, మేర లేని పున్నెములలిబ్బికిఁ బరిణామ మైనయంతటివాంఛ యటుండుఁ గాక.

---

* ఇది భట్టారకుని "లేకను" కుటిడి. ప్రౌఢవ్యా. శబ్ద. ౧౧౧౬.

గీ. నాకుఁ గ్రమ్మఱ నొకసారి నయనహారి
ప్రణయపిశుననానాభావబంధరమ్య
మగుతదాననమును గాంచ నగున యేని
యదియె మామకపూర్వపుణ్యములఫలము.

(పటాక్షేపముతోఁ గువలయావలి చంద్రలేఖయుఁ బ్రవేశింతురు)

చంద్ర:—చెలీ, మందమతిచే వదలిన మణిముద్రిక సమీపమునఁ దిరుగుదారవారి కగపడవచ్చును. అట్లుగాక మఱియొకని కగపడునేమో యని కలవరపడు చున్నాను.

కువల:—(తనలో) ఆమహానుభావుఁడు మణిముద్రికను జూచునంతటిభాగ్య మీకువలయావలి కెక్కడిది? (ప్రకాశముగా) సఖీ, అట్లైనఁ దొందరగాఁ బోయి వెదకుదము. (పరిక్రమింతురు)

శ్రీవ:—వయస్యా ఊరకుండుము. ఇదిగో విస్రంభగోష్ఠికి నెలవైనదుష్టదాసీపుత్రకుని సల్లాపమువలె నేదో వినఁబడుచున్నది.

శ్రీకృ: నిజముగా, ఈసుదతి చెలితోఁ గూడి మణిముద్రికను వెదక వచ్చినకువలయావలియే కావలయును. మిత్త్రమా, ఈపొదలలో దాఁగియుండి యవలోకింతము. (అట్లు చేయుదురు)

శ్రీవ:—మణిముద్రిక యేమో దానిని వెదకుట యేమో నా కేమియు గోచరించుట లేదు.

శ్రీకృ:—మిత్త్రమా, కువలయావలిమణిముద్రిక కారణాంతరమున జాఱి పడిపోయి నా కగపడినది. (మణిముద్రికను జూపును.)

శ్రీవ:—(చూచి) వయస్యా, ఏదీ యిక్కడ మణిముద్రిక ?

శ్రీకృ:—(తనలో) ఔరా ! అచింత్యము గదా తపోవిశేష సామర్థ్యము ! మణిముద్రిక నేను జూపినను నీతనికిం గాన్పించుట లేదు. (ప్రకాశముగా) తెలిసిపోయినది లే యిప్పుడు మాకు నీబ్రాహ్మణ్యము ! సంధ్యావందనము రానివాని కీమణిముద్రిక గనంబడ దని యిందే వ్రాయంబడి యున్నది.

శ్రీవ:—ఇది వ్రాసినవా రెవరు ?

శ్రీకృ:—మిత్త్రమా, బ్రహ్మర్షి నారదులవారు.

శ్రీవ:—మహారాజా, వీణాగాయకుం డైనయాబ్రహ్మబంధుని మాట నమ్మి శ్రీవత్సుని నీవు తప్ప మఱి యెవ రాక్షేపింతురు ?

శ్రీకృ:—ఆదేవర్షికిని నీకును గలశక్తితారతమ్యము నిదియే వెల్లడించు చున్నది.

శ్రీవ:—ఔరా యెంత గొప్పదయ్యా, నీశక్తితారతమ్యపరిజ్ఞానము ! నీప్రసాదాన రేపు మాపు శర్కరాఖండమో

దశశతముల నమితముగా మెక్కునీశ్రీవత్సుఁడు శక్తి లేని వాఁడు. కందమూలఫలాలు తినునానారదుఁడు శక్తి కల వాఁడు. (సంరంభముతో నెడమపిడికిలి యెత్తి) మహా రాజా, ఏదీ యాశక్తిమంతు నిక్కడకు శీఘ్రముగాఁ దీసి కొని రా. ఒక్కపిడికిటిపోటుతో నామహార్షిని నేలపైఁ బడఁ గూల్తును లేకున్న నీజందెము ద్రెంపి పాఱవైతును. (ఉప వీతస్థానము తడవి చూచుకొని విషాదముతోఁ దనలో) ఆనందమున నర్తించునప్పుడే జందెము తునాతునుక లైపోయినది. కావునఁ బ్రసంగము మార్చివేయుదును. (చూచి) వయస్యా, ఇది చంద్రలేఖ గదా! ఆరెండవ యామె యెవరు? (ఆలోచించి) ఆ! నాకుఁ దెలిసినది. అలిగిననన్ను బతిమాలుకొనుటకు విలాసవనదేవత తానే వచ్చుచున్నది. అట్లు కాదు. జయలక్ష్మీసహితుని నిన్నభి నందించుటకే వచ్చుచున్నది.

శ్రీకృ:—(చిఱునవ్వుతో) మిత్త్రమా, యీయింతి వనదేవత గాదు. నేను జెప్పినయాకువలయావలియే.

శ్రీవ:—ఆశ్చర్యము. ఆశ్చర్యము. నరవనితలయందిట్టిసౌభా గ్యలక్ష్మి యపురూపము. వయస్యా, నీచూపు తగినచోటనే తగులుకొన్నదయ్యా,

చంద్ర:—(అంతటను వెదకి విషాదముతో) చెలీ, ఉంగరము కనఁబడ లేదు. ఏమి చేయుదము?

కువల:—(వినమి నభినయించి తనలో) హృదయమా, సఖికిఁ గలిగినసందేహముచేతనే యేల నిన్నుఁ గృతార్థమునుగాఁ దలఁతువు ?

చంద్ర:—(తనలో) ఏమిది ? ఈమె యన్యమానస యై నాపలుకులు గ్రహింపనే లేదు. (ప్రకాశముగా) చెలీ, చెప్పుచున్నానుగదా! 'ఇక్కడ రత్నాలంకారము కనఁబడ లే' దని.

కువల:—రత్నాలంకార మొకటే గాదు.

చంద్ర:—మఱి, యింకొక టేమి ?

కువల:—(తనలో) ఓరా నాచిత్తమునకుఁ గలయధైర్యము ! రత్నగర్భాలంకార మగునామహాభాగుఁడును గనఁబడ లే దని యన సాగితిని. కానిమ్ము. ఇట్లనెదను. (ప్రకాశముగా) సఖీ, రత్నాలంకారతస్కరునియడుగులజాడ గూడఁ గనఁబడ లేదు.

చంద్ర:—ఇక్కడ దొరవారియడుగులజాడయే కనఁబడుచున్నది. ఇతరులది లేదు.

కువల:—(నర్మస్మితములతో) సఖీ, ఇతనియెడల నీసందేహము తగినదే. ఇతఁడు కాళిందీవారివిహారివల్లవీవస్త్రతస్కరుఁ డని వినుచున్నాము గదా !

శ్రీకృ:—మిత్త్రమా, సమయము దొరకినది గదా ! వెలువడెదను.

శ్రీవ:—ఖండమోదకము చేతికిఁ జిక్కి యుండ నాలుక నాఁకట్ట నేల ? (ఇరువురు సమీపింతురు)

శ్రీకృ:—

చ. చరణములన్ సరోజరుచి;
జంఘలచేత నిషంగసంపదన్;
గ ఊరువులచే నరంట్లసాబ
గున్; జనుదోయిఁ బరంట్లసొంపు; నం
బురుహదళాక్షి, వక్త్రమునఁ
బూర్ణశశిద్యుతి; నీవె దోఁచి త
స్కరుఁ డని నన్ వృథా పలుకఁ
జన్నె యిటుల్ విపరీతభాషిణీ,

పోనిమ్ము. నేను దస్కరుఁడనే యగుదును.

గీ. తస్కరునిచేతియందు దున్నధనము సైత
మతివిచిత్రవిధంబున నపహరించి
స్తేయవిద్యావిశేషంబుచేత నీవె
నన్నుఁ దలఁదన్ని యున్నావు వన్నెలాఁడి,

చూడుము.

ఉ. ఊరుల మద్దదాగరిమ
నో*కరభోరువ, దోఁచికొంటి; గం

---

* మహిళీవాచకమగు శరభోరువు శబ్దము సంబుద్ధిని శరభోరువ, శరభోరువా అనురూపములే వ్యాకరణసమ్మతములు.

క. ఓకదళీస్తంభోరువ, రయముల మేవాఁడెదానవు...భాగ. ౩.౩౩౨.

భీరసునాభి, చక్రరుచి
పెంపు హరించితి నాభిచేత; గ్రీ
వారమఁ బాంచజన్యవిభ
వంబుపసల్ కలకంఠి, కొంటి; చా
కోరకనేత్ర, భ్రూలతికఁ
గొల్లలువెట్టితి శార్ఙ్గసంపదన్.

కువల:—(లజ్జాసాధ్వసములతోఁ జెలిమాటున నిలిచి తనలో) ఔరా పురుషోత్తమునిసల్లాపచాతుర్యము! (జనాంతికముగా) చెలీ, ప్రసంగాంతరమున నీతని వారింపుము.

చంద్ర:—భట్టారకా, 'అట్టినాయంతరంగమును దొంగిలించిన మహారాజు నాకన్న గొప్పదొంగ' యని యామె విన్నవించు చున్నది.

కువల:— పో. ధూర్తులారా, పో. నేననని మాటలు చెప్పుచున్నావు. (సఖిని ధిక్కరించి పెడమొగము పెట్టినిలుచును)

శ్రీప:—చంద్రలేఖా, అంతరంగచౌర్యము వీరిద్దఱకును సమానమే.

చంద్ర:—ముద్రికాచౌర్యము మీయం దధికము గదా!

కువల:—(ప్రసాదస్మితములతో సఖిని జూచును)

శ్రీకృ:—(కువలయావలియెదుట నిలిచి) సువర్ణవిన్యాసము గలయీముద్రిక నీదేని తీసికొనుము. (తనచేత నున్న మణిముద్రికను జూపును)

కువల:—(చూచి సంతసముతోఁ దనలో) అక్షర లేఖనము గల సామణిముద్రిక యీమహాభాగునకు దొరకినది. (హృదయము నుద్దేశించి) హృదయమా, ఇప్పు డిట్టిసీకోరిక లీరికలెత్తినవి. (ముద్రికను గైకొనఁ దలఁచుచుఁ గరాగ్రకంపము నభినయించి జనాంతికముగా) సఖీ, నాకరాగ్రము కంపించుచున్నది. కావున దీనిని నీవు గైకొనుము.

చంద్ర:—చెలీ, ఏలినవారు నీయంతరంగమును దొంగిలించియుండిరి గదా! నీకరాగ్ర మెట్లు కంపించుచున్నది?

కువల:—సఖీ, మొదలే సిగ్గుపడియున్న నన్ను ఏల మఱింత సిగ్గుపఱిచెదవు?

చంద్ర:—మహాప్రభూ, ఉంగరము నిటు దయచేయుఁడు.

శ్రీవ:—అయ్యా, ఒకరిసొమ్ము మఱియొకరిచేతిలోఁ బెట్టఁ గూడ దని నాయభిప్రాయము.

శ్రీకృ:—(చిఱునవ్వుతో) విద్వాంసుఁ డైనయీశ్రీవత్సుని యభిప్రాయము న్యాయ్యమే.

చంద్ర:—చెలీ, ఇంక నీవే కైకొనుము.

కువల:—(మిగులఁ గష్టముతోఁ జేయి చాఁచును.)

శ్రీకృ:—కల్యాణీ, చిటికెనవ్రేలు చాఁపుము. నేనే ముద్రిక నలంకరింతును.

కువల:—(తనలో) ఇప్పుడు గతి యేమి?

చంద్ర:—(ప్రణయకోపముతో) చెలీ, అక్కడనే యెంతసేపు జాగు చేసెదవు ?

కువల:—(మిగులఁ గష్టముతోఁ జిటికెనవ్రేలు చాఁపును.)

శ్రీకృ:—చిటికెనవ్రేలు మెల్లగాఁ బట్టుకొని కువలయావలి మొగమును సాభిప్రాయముగాఁ జూచును.)

కువల:—(రోమాంచ స్మితములతో మొగము వంచుకొని యుండును)

(నేపథ్యమున)

చెలీ, చంద్రలేఖా, క్రొత్తవస్తువులు చూపువేడుకతో నెంతసేపు కువలయావలిని వినోదపెట్టెదవు ? సువాసినీపూజ యందు మక్కువ గలరాణిగా రంతిపురమున కేఁగి చాలసే పైనది. ఎంత వెదకినను మీరు నాకుఁ గనఁబడ లేదు.

చంద్ర:—(విని) అయ్యో ! చకోరిక యిటు వచ్చుచున్నది.

శ్రీకృ:—(కువలయావలిని వదలి ముద్రిక నేలపైఁ బడవైచి వయస్యునితో దాఁగి యుండును.)

చకోరిక:—(ప్రవేశించి) చెలీ, చంద్రలేఖా, క్రొత్తవస్తువులు చూపువేడుకతో...... (మొదలగునది పఠించును.)

చంద్ర:—నెచ్చెలీ, ఇటు. ఇటు.

చకో:—(సమీపించును.)

చంద్ర:—చెలీ, కువలయావలిమణిముద్రిక జాఱి పడిపోయి నది. దానిని వెదకుదము రా. (అందఱు మణిముద్రికను వెదకుదురు.)

చంద్ర:—(చూచి సంతసముతో) ఇదిగో ముద్రిక. (తీసికొని) చెలీ, రా. పోదము. (పరిక్రమింతురు.)

శ్రీకృ:—అయ్యో ! ప్రియతమ పోవనే పోవుచున్నది.

కువల:—(కన్నులలోఁ బరాగము పడుట నభినయించి) సఖీ, కుసుమపరాగము పడి నాకన్నులు కలఁగినవి.

చంద్ర:—(జనాంతికముగా) కుసుమశరములు పడి నీమనసు గూడ. (పరాగము నపనయించును)

కువల:—(ప్రియాసూయలతోఁ బోలె) సఖీ, ఇప్పటికిని నా కన్ను లపరాగములు కాలేదు.

చంద్ర:—చెలీ, కన్నులనుండి పరాగము పోయినది. రాగము మాత్రము గాటముగా నాఁటుకొని యిప్పుడు గూడ వెలయుచున్నది. కనుక విలంబ మేల ? పోదము. రా

(నిష్క్రమింతురు.)

శ్రీవ:—వయస్యా, పరుషముగా నున్నను ఇప్పటిశ్లిష్టసల్లాప గోష్ఠి కండచక్కెరవలె మధురముగా నున్నది సుమా !

శ్రీకృ:—మధుర మనెద వేమి ?

గీ. లలితకవితావిలాసముల్ శ్రవణమధుర

విలసదాలాపరాగసంభేదములును

యువతిజనపక్షపాతము లొందవ వెపుడు
భూరిపుణ్యంబొనర్పనిపూరుషులకు.

మిత్రమా, ఇక మనము చేయవలసినపని యేమి ?

శ్రీవ: పౌరులకు నేత్రానందము గూర్చుటకన్న మతే మున్నది ?

శ్రీకృ:—ప్రియవయస్యునియిష్టము. (పరిక్రమించుచు స్మరణముతో)

గీ. పులకితకపోలమండలము వికసితదృ
గంతసూచితాకూతము నగుమొగంబు
నతివ నమియించియును నున్నమితము జేసె
రతిమనోహరుసర్వసామ్రాజ్యగరిమ.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది ద్వితీయాంకము.

శ్రీ

# రత్నపాంచాలిక



## తృతీయాంకము

కంచుకి:—(ప్రవేశించి తనయవస్థను దలఁచుకొని)

గీ. కాంతవలె నన్ను నీజర కౌఁగిలింప
బహుముఖేంద్రియగతి మానె; వడఁకు జడత
యొడలికి ఘటిల్లె; నింక నే నడువ నైన
నడఁగు దీసి యడుగు వెట్ట నైనఁ జాల.

ఆహా! ప్రభువులవిశ్వాస మాశ్వాసము గలిగించు చున్నది.

గీ. అలపు గదురును నొందు రెండడుగు లిడినఁ;
జేవెలుంగిడకున్న వీక్షింప దక్షి;
చెవులు వినఁజాల వెలుఁగెత్తి చెప్పకున్న;
నయిన నియమించు నను హితక్రియల దేవి.

నేఁడు విదర్భరాజనందన నాతో సగౌరవముగా నిట్లు
చెప్పినది,—"ఆర్యా, బభ్రుముఖా, ఆర్యపుత్రుఁడు కాల

యవనవిజయమున కేఁగునప్పుడు తాను మరలి వచ్చిన వెంటనే సకలపురపురంధ్రీసమేత లగురాణులచే రైవతక కందరకదంబవనవాసిని యైన భవానీదేవియాత్రామహోత్సవము చేయింప సంకల్పించి యుండె నఁట. కావున మే మిపుడు రైవతకమునకుఁ బోవుచున్నాము. ఉద్యానవిహారపుబడలిక నోడలిలోఁ గుదురు లేక గాసిఁబడుచున్న కువలయావలినిఁ జంద్రలేఖతోఁ గూడ నింటనే యుంచితిమి. ఈమెను వెలుపలకు రాకుండఁ గాపాడుము" అని. కనుక సావధానముగ దేవిగారియానతి నాచరింతును.

(పిమ్మటఁ గువలయావలి చంద్రలేఖయుఁ బ్రవేశింతురు.)

చంద్ర:—చెలీ, నీవు మణిముద్రికను ధరింపలేదు గదా! ఇంక రత్నపాంచాలికాభ్రమను గలిగింపని నిన్నీవృద్ధ కంచుకి తెలిసికొన లేఁడు. కావున నిర్భయముగా విలాసోద్యానమునకుఁ బోదము రమ్ము.

కంచుకి:— (చేవెలుఁగిడి చూచి) ఆపాదధ్వని యెవరిది?

చంద్ర:— ఆర్యా, నేను జంద్రలేఖను గదా! ఈమె యిందీవరాళి యనుసంచారిక. ఈమెచేత రాణిగారు కొకరహస్య వృత్తాంతము చెప్పంపినారు. అది యేలినవారిసన్నిధిలో విన్నవింతును. నీవు గువలయావలీభవనద్వారమును భద్రముగాఁ గాపాడుచుండుము.

కంచుకి:—కల్యాణీ, పో. పని నెఱవేర్చుకొని తొందరగా రా నేను మెలఁకువ గలిగి యుందును. (నిష్క్రమించును.)

చంద్ర:—చెలీ, మోసపుచ్చినారము గదా యీవృద్ధకంచుకిని!

కువల:—(తనలో) మఱి, ఈతాపమును మోసపుచ్చుట యెట్లో తోఁపకున్నది. (ప్రకాశముగా) సఖీ, కదళికాగృహ మిం కెంత దూరము?

చంద్ర:—ఇదిగో, ఇదే. నెచ్చెలీ, ప్రవేశింపుము. నడబావి తరఁగతుంపురులు పడి చల్లనైనయీచలువఱాతిపైఁ గూర్చుందము. (ఇరువురు కూర్చుందురు.)

కువల:—సఖీ, నాయంగకములు మిగులఁ దపించు చున్నవి.

చంద్ర:—(నిమిత్తము సూచించుచు)చెలీ, ఇదిగో శుభసూచన. ప్రచ్ఛాయశీతల మగునీతావున నిప్పుడే నీసంతాపము తప్పక శమింపఁ గలదు.

(శ్రీకృష్ణుఁడు ప్రవేశించును)

శ్రీకృ:—(మదనావస్థను నటించుచు) ఎంత ధీరుఁడ నైనను ధైర్యాభిసంధిపరిపంథి యగుమారు నెదిరించు టెట్లు?

గీ. వింట సంధింపకున్న శబ్దించుకొనుచు
శరము లరయుచుఁ దన్మౌర్వి దిరుగఁ గాన
నిఖిలధీరపరీభావనిపుణ మగుచు
నించువిలుకానిమహిమ జయించి మించు.

(కోరికతో)

ఉ. లాలితఫుల్లగండయుగ

ళంబు సముద్గతసుస్మితంబు ని

ర్వేలతరానురాగ మురరీకృతసూనశరాసతంత్ర మా

బాలకురంగనేత్రరస

బంధురసల్లపనామృతంబు గే

స్తేలను గీలుకొల్పి సుఖ

లీలను గ్రోల ఘటిల్లు నెన్నఁడో ?

ఏమిది శ్రీవత్సుఁ డాలస్యము చేయుచున్నాఁడు ?

శ్రీవత్సుఁడు:—(ప్రవేశించి హర్షముతో) నేఁడు యోగమాయామహోత్సవ మనునెపము పెట్టి నగరములోని ముత్తైదువల నెల్ల దేవేరులతోఁ గూడ సాగ నంపితిని. కావున నామంత్రప్రభావము ప్రియవయస్యునకు నివేదింతును. (పరిక్రమించి) ప్రియవయస్యుఁడు వర్ధిల్లుఁ గాక.

శ్రీకృ:—(సాభిప్రాయముగా నవ్వుచు) మిత్త్రమా, నిధానసాధనమున నీమంత్రప్రయోగము ఫలించినదా ?

శ్రీవ:—మంత్రబలమున నెట్లో దేవీపన్నగీలోకమును బాఱఁ దోలినను దేఱి చూడ రాక యానిధిని బెనుభూత మొకటి యెపుడు కాపాడు చున్నది. రుక్మిణీదేవి కువల యావళిని రక్షింప బభ్రుముఖుని నియమించినది.

శ్రీకృ :— ఈకంచుకి విశ్వాసి. సామదానములకు లొంగఁడు.

శ్రీవ:— కల్లలాడి నేరము మోపి యాబంటువానిని జెఱఁ బెట్టింతునా ?

శ్రీకృ:— పాపము శమించుఁ గాక ! పాపము శమించుఁ గాక ! ఛీ ! మూర్ఖుఁడా, పరమాప్తులకుఁ గీడు దలఁచుచున్నావు.

శ్రీవ:— అట్లైన వాఁడు చిరకాలము సుఖపడుఁ గాక !

శ్రీకృ:— ఈయెండవేళ గదళికాగృహమునఁ గడపి మునిమాపు తగినయుపాయ మాలోచింతము.

శ్రీవ:— వయస్యా, ఇదే యుద్యానము.

(ఇరువురు ప్రవేశము నటింతురు.)

శ్రీకృ:—

కవిరా. అళితతిఝుంకృతిహుంకృతులున్ గిస
లాధరముల్ స్తబక స్తనముల్,
గళికలపుల్కలు నై విరళల్ మఱి
గాక విభాసిలుతీవియతో,
య్యలులను గాంతవసంతమహాంబుల
నానతశాఖల బాహువులన్,
జెలఁగి రసాలము లన్ రసికుల్ దమిఁ
జేరు రొగిన్ బిగికౌఁగిళులన్.

శ్రీవ:—వయస్యా, వసంతఋతువును బొగడిన నేమి ఫలము? ఋతువులదొరను వర్షర్తువును బొగడుము.

శ్రీకృ:—వర్షర్తువున కింత గొప్పతన మెట్లు ?

శ్రీవ:—అందు శ్రవణరసాయనము లైననిమంత్రణాక్షరములు నాసికారసాయన మైనపాకపరిమళము రసనారసాయనము లైనవిస్తారభోజ్యపదార్థములు గలిగి బ్రాహ్మణులపాలిటికల్ప వృక్ష మగుమహాలయపక్షము వచ్చును గనుక.

శ్రీకృ:—సెబాసు ! తిండిపోతా, సెబాసు !

శ్రీవ:– వయస్యా, చూడవయ్యా, ఇంద్రియముల కెల్ల నింపులు గొలుపుశృంగారవనసౌభాగ్యము.

శ్రీకృ:—(అర్ధాంగీకారముతో)

చ. మలయమరుద్విహార మిటు
　　మత్తమధువ్రతగాన మిచ్చటన్
సులలితవల్లిలాస్య మిట
　　సూనరజస్తతినెయ్య మియ్యెడన్
బలియుటఁజేసి యన్యకర
　　ణంబులు దృష్టి గనెన్; రసజ్ఞయే
చిలుకలకొల్కి-వాతెఱను
　　జిప్పిలుతేనియ లేమి శోషిలున్.

శ్రీవ:—వయస్యా, విరితామరల జాలువాఱుమకరందబిందువుల బరువెక్కి-సజక్క-వలఱెక్క-లజాడింపులఁ జెదరి తూఁ

గాడుకలువలతావి వెదచల్లుపిల్ల తెమ్మెరల కిన్నగుదిగుడు బావి యిదిగో !

శ్రీకృ:— గీ. కోకనదసైకతావర్తకోకయుగళ
కువలయము లింతినెమ్మేనిసవతునందు
స్వాధికారపరిభ్రంశ మంది యిందుఁ
జేరె నన్నియు నొక్కచోఁ *జిన్నఁబోయి.

కువల:— సఖీ, ఈబీఱెండతాపము నాయంగకముల దహించు చున్నది.

చంద్ర:— నలువైపుల గుబురుకొన్నతియ్యమామిళ్లనీడలఁ జల్ల నైనయీతావున కెండ యెట్లు రాఁగలదు ?

శ్రీవ:— (విని నిరూపించి) వయస్యా, ఇదిగో చంద్రలేఖా ద్వితీయ కువలయావలి.

శ్రీకృ:— (అనురాగసంభ్రమముఁతో) శ్రీవత్సా,
చ. హరువగు నెందతర్క్యనయ
నామృతవర్తి ? సఖా, యకల్పనా
పరిణతకల్పవల్లి యెట
భాసిలు ? నాసిరుపాధిసిద్ధమే
దురపరితోషసిద్ధఘుటి
తొయ్యలి యెయ్యెడఁ దోఁచు ? నీవనాం

* మ...నరేంద్రా, యింద్రసంకాశను ! దనుఁ డొక్కండను లేమి నీనగరు చిన్నఁబోయె...శరాహపురా. ౧. ౯౩.

తరమున నేడ నున్నది య

నక్షరమోహనమూలవిద్య తాన్ ?

శ్రీవ:—ఇదిగో కదళికాగృహమున.

శ్రీకృ:—(చూచి)

గీ. పవనవిచలితకదళికాపత్త్రములను

దరుణి పరిలక్షితయుఁ బిహితయును నగుచుఁ

గలితవిశ్లేషసంశ్లేషముల రతివలె

నుత్కలికఁ గూర్చు నిపుడు నాయుల్లమునకు.

మిత్త్రమా, వారిసంభాషణమును వినుచుండి తగినసమయమున సమీపింతము.

శ్రీవ:—ఔనౌను. ఎఱుఁగుదునయ్యా, 'సంయోగము కంటెను ప్రేమపరీక్షణము సుఖకర' మని.

శ్రీకృ:—మిత్త్రమా, పరమానందసర్వస్వమును బరిపూర్ణముగాఁ బలుకుచున్నాఁడవు.

ఉ. భావనివేదనం బయిన

భామినివాగమృతంబు ద్రాఁగి యే

భావితభాగ్యవంతుఁడు శ్ర

వఃపుటిఁ గ్రోలి ముహూర్తకాల మే

నేవిధిఁ దృప్తి నొందు; నటు

తృప్తి వహింపఁగ నేరఁ డెన్నఁడున్

గేవలమేళనంబున న
నేకసహస్రసమల్ గమించినన్.
(ఇరువురు తీఁగలలో దాఁగి యుందురు)

శ్రీవ:—వయస్యా, చూడుము. ఈమె వేషమే సంతాప
మును దెల్లముగా వెల్లడించు చున్నది.

శ్రీకృ:—మిత్త్రమా, నీవు చక్కఁగాఁ గనిపట్టినావు.

ఉ. కాయము సాంద్రచంద్రఘుటి
కామయభూషలఁ దన్పుతన్పులున్,
బాయక మంచిగందము స్త
నద్వయిఁ జెల్లుగఁ బూయుపూఁతలున్,
దోయరుహోదరంబును గ
నుంగవఁజేతుల నొత్తునొత్తులున్
బ్రేయసితాపతీవ్రతను
వెల్లడిసేయుచు నున్న వక్కటా!

కువల:—సఖీ, తాపకారణ మగుకదళికాగృహమును దాప
నివారణ మని కల్ల లాడుచున్నావు.

చంద్ర:—(కువలయావలిమీఁద లేఁజిగురరఁటాకులు గప్పి
విసరు చున్నది)

కువల:—సఖీ, మొదటఁ గప్పురపుఁబలుకులతో రాఁజఁబెట్టిన
మదనానలము నిప్పు డరఁటాకులతో విసరి యేల రవులు
కొల్పెదవు? (వానిని దీసి పాఱవేయును)

చంద్ర:—(తనలో) అయ్యో! ఈమెకు మదనతాపము ముమ్మ రించినది. (ప్రకాశముగా) చెలీ, నీ వధీరవు సుమా!

కువల:—సఖీ, ఆమనదొరను జూచినదిమొదలు కుమ్మనం గ్రుక్కినట్లు దుర్భర వేదన పడుమేను దాల్చి యున్నను న న్నధీర వని యె ట్లనుచున్నావు?

శ్రీన:—వయస్యా, విన్నావా యిది?

శ్రీకృ:—మిత్త్రమా, శబ్దగ్రాహక మగు మాయింద్రియ మిప్పుడు సఫల మైనది.

గీ. అధికవత్సల యైనవయస్యయెదుట
నిగదితంబులు కైతవవిగళితములు
భావబంధసూచకము లీపడఁతిపల్కు
లాలకించితిఁ గర్ణరసాయనములు.

చంద్ర:—చెలీ, ప్రభువును దోడ్కొని వచ్చుటకు నీయనుమతి లే దని జంకుచున్నాను.

కువల:—

క. కలకంఠము విషకంఠము;
కలికి, ప్రవాళంబు దీర్ఘకరవాలంబుగా;
మలయానిలుఁడు జ్వలనుఁడు
జ్వల*చందుఁడు గావుతగ విషస్యందుఁడు గాగ.

* చందుఁడు=చంద్రుఁడు. (కల్పద్రుమము)

క. సుమశరుఁడు కోపగించిన
సమయించును గాక; మించి సలుపఁ గలఁడె? స్తో
త్రమునకుఁ బాత్రముఁ గన్యా
సమయంబు నతిక్రమింపఁ జాలఁ బ్రియసఖీ,

శ్రీవ: — బళీ! మానవతీ, బళీ!

చంద్ర: — (తనలో) మత్తేదేని యూఱడిలఁ జేయు ప్రసంగము దెచ్చి యీమె వేదన మఱపింతును. (ప్రకాశముగా) చెలీ, ఉష్ణ ముష్ణమున శమించును. కనుక నీసంతాపము భర్తృ సంతాపమున శమించును.

కువల: — సఖీ, 'భర్తృసంతాప' మని యిచ్చకాలాడి నన్నూఱడించు చున్నావు.

చంద్ర: — అట్లు కాదమ్మా. ఇది నిజము. నీతోడు.

కువల: — (హర్షగద్గదస్వరములతో) సఖీ, నీకెవరు చెప్పినారు?

చంద్ర: — దేవేరులతోపాటు తాను గూడ భవానీమహోత్స వమునకుఁ బోవఁ సియుండ నీయందలిగాఢానురాగమున మానినయేలినవారియదక్షిణత.

శ్రీవ: — (తటాలున దగ్గఱకు వచ్చి) మున్నడవిదున్నవలె నట్లు బలిసి యిప్పుడు ప్రియవయస్యునిచింతచే నిట్లు చిక్కిపోయినయీబ్రాహ్మణుఁడు శ్రీవత్సుఁడు గూడ.

కువల: — (భయకంపములతో) అమ్మయ్యో! కోఁతి మనుష్య భాష మాటలాడు చున్నది.

చంద్ర:—(జనాంతికముగా) చెలీ, ఇట్లనకుము. ఇతఁ డేలిన వారిప్రియవయస్యుఁడు గదా! (తనలో) ఏలినవారు గూడఁ జేరువనే యుందురు. కానిమ్ము. ఇట్లు చేయుదును. (ప్రకాశముగా) ఓసీ, తప్పుడుబాఁపఁడా, ఇట్టివంకరమాట లాడు చున్ననిన్ను దేవిగారిసన్నిధికి లాగుకొని పోయెదను. (జుట్టు పట్టుకొనును)

శ్రీవ:— అయ్యో! అయ్యో!

శ్రీకృ:— చంద్రలేఖ జాణ. అది నిజముగా నన్ను రప్పించుటకే యిట్లు చేసినది. కావున సమీపింతును. (సమీపించి) మిత్త్రమా, భయపడకుము. భయపడకుము.

చంద్ర:—(శ్రీవత్సుని వదలి) జయము జయము ఏలినవారికి.

కువల:—(శృంగారసాధ్వసములతో లేవఁ బోవును.)

శ్రీకృ:—(బలవంతముగాఁ గువలయావలిని నివారించుచు) ఇప్పు డుపచరణీయులము మేము గాదు.

గీ. నవనవమృణాళకాండపేలవము మున్నె
గురుపయోధరభారభంగురము పిదప
నధికపరితాపనిస్సహం బవల నిట్టి
నీతనువు మాకె పరిచరణీయ మబల,

చంద్ర:—ఏలినవారు పీఠము నలంకరింపకముందే ప్రియసఖి యెట్లు కూర్చుండును? కనుక నీనున్ననిచలువరాతిపలకను దేవరవా రొకయోర నలంకరింతురు గాక.

శ్రీకృ:—ప్రియసఖియిష్టము. (కూర్చుండును)

కువల:—(అవయవసంకోచముతో సాసూయముగా సఖిని జూచుచు మరల లేచును)

శ్రీకృ—(పైఁట చెరఁగు పట్టుకొని)

క. కరభోరువ, పృథుజఘనా,
హరిమధ్యా, నిమ్ననాభి, *సాంద్రోరోజా,
♦సరసిజముఖి, కలకంఠీ,
దరితచకోరాక్షి, యీవ్యథాశ్రమ మేలా ?

(మరలఁ గూర్చుండఁ బెట్టును)

శ్రీవ—పక్షపాతి యైనరాజుదగ్గఱ నుండఁ గూడదు. ఇతఁడు శిష్టబ్రాహ్మణుని ద్వేషించు నీదుష్టదాసిని 'ప్రియసఖి' యని గౌరవించు చున్నాఁడు. మఱియు దానియుపదేశమునే యనుష్ఠించు చున్నాఁడు. (తొందరగాఁ బోవుచుండును)

చంద్ర—ఓశిష్టబ్రాహ్మణా, అ ట్టైన నాయవినయక్రమములను దెలుపుట కిటు రా. (వెంబడించును)

శ్రీవ:—ఓసీ, బజాఱీ, రా. రా. సత్యభామాదేవియెదుటనే తెలిపెదను. (మాటిమాటికి జుట్టు విప్పి ముడివేసికొనుచు నిష్క్రమించును)

---

*సాంద్రి:—సహ అంద్యతే, (అది బంధనే. బాహులకాద్రక్. (అమరసుధ) ♦ పాఠాంతరము:- పరభృతగళి, జలజముఖీ,

చంద్ర:—అయ్యా, శ్రీవత్సయ్యా, శాంతించు.

(శ్రీవత్సుని వెంబడించును)

కువల:—సఖీ, నీవు గూడ నన్ను వదలివేయుదువా ?

(వెంబడిఁ బోవుటకై లేచును)

శ్రీకృ:—ప్రేయసీ, కువలయావలీ,

గీ. మరుఁడు కరుణాకరుఁడు లోకగురుఁడు నిన్ను
స్వేదజలధారతో దయచేసె నాకు
మనపరస్పరరాగబంధనమునందు
నంద్యుఁ డీరాగవహ్నియే ప్రథమసాక్షి.

(గడ్డము పట్టుకొని మొగము పై కెత్తును)

కువల:—(మొగము లాగుకొని) యాదవా, నలుగురిలోను నన్నుఁ జులుకన సేయకుము.

[పిమ్మట సత్యభామ చతురికయుఁ బ్రవేశింతురు]

సత్య:—(సౌభాగ్యగర్వముతో) సఖీ, చతురికా,

గీ. సహజసౌందర్యపాటవసంగతంపు
తగును కృత్రిమవేషయుతంబు గాఁగఁ
బ్రియరతారంభములు నవవేషము లిలఁ
దనరు చున్నది గా! రతాంతములు గాఁగ.

చతు:—దేవీ, స్త్రీ లెల్ల సత్యభామలు గారు. పురుషు లెల్లఁ బురుషోత్తములు గారు.

సత్య:—(ఆదరస్మితములతో) సఖీ, కదళికాగృహమునొద్ద నార్యపుత్త్రుఁ డగపడినట్లు నీ కెవరు చెప్పినారు ?

చతు:—దేవీ, విలాసోద్యానపాలిక కలకంఠిక.

సత్య:—సఖీ, దాఁగియుండి సమయము గనిపట్టి తటాలునఁ బ్రవేశించి కల్లరోషపుమిషంబూని ప్రియునితో వినోదింతును.

చతు:—ఇదే విలాసోద్యానము. (ఇరువురు ప్రవేశింతురు)

చతు:—దేవీ, ఆనాఁ డపరాధియై బలవంతముగాఁ గాళ్లు పట్టుకొని బతిమాలుకొను చున్నప్రియతమునిఁ గేసరకర్ణోత్పలముతో నిక్కడ దండించితివి గదా !

సత్య:—(చిఱునవ్వుతో)ఆకదళికాగృహమపూర్వముసుమా !

చతు:— ఇవిగో యేలినవారిమాటలు వినిపించు చున్నవి.

సత్య:— అట్లైన దాఁగియుండి వారిసంభాషణము విందము.

(అట్లు చేసి యిద్దఱు కువలయావలిని జూతురు)

చతు:—దేవీ, ఇక్కడ మఱేదో జరుగుచున్న ట్లున్నది ?

సత్య:—సఖీ, ఇతఁడు నమ్మోఁ దగనివాఁడు గదా !

శ్రీకృ:—(అనునయముతో)

గీ. కొమ్మలఁ బ్రవాళముల సూనగుచ్ఛములను
వఱలు చున్నది నీతనూవల్లి కలికి,
నీకటాక్షంబె ఫలము దీనికిని; గాన
నేలికొను మీవు న; న్నింక జాల మేల ?

(కువలయావలిముఖమును బట్టుకొని పైకెత్తును)

కువల:—ఆర్యా, విడువుము. వినయము గాపాడుకొనుము.

సత్య:—(తటాలున దగ్గఱకు వచ్చి) ఓసీ పడుచా, కన్యకా కాముకుఁడైనయీమహారాజుప్రార్థన సఫలముచేసి నీవు వినయము కాపాడుకొనుము.

శ్రీకృ:—(సాశంకముగాఁ గువలయావలిని వదలివేయును)

కువల:—(భయముతోఁ దొలఁగి పోవుచుఁ దీఁగలచాటున కేఁగి నిలిచి దిక్కులు చూచు చుండును)

చంద్ర:—(ప్రవేశించి కువలయావలిని గౌఁగిలించుకొని) చెలీ, నీతనులత యేల కంపించు చున్నది ?

కువల:—(ఎట్టకేలకుఁ దేఱుకొని) సఖీ, నాచాపల్యమును సత్యభామ చూచినది.

చంద్ర:—(జంకుతో) ఈమబ్బు లేనిపిడుగులవాన యెక్కడ నుండి వచ్చినదో ? సరే. అంతిపురమునకుఁ బోదము. రా.

(కువలయావలిచేయి పట్టుకొని నిష్క్రమించును)

శ్రీకృ:—(దోసిలి యొగ్గి)

గీ. బాధితము తప్పు లే దని పలుకుపలుకు;
తనరు ననుమాంట దాసత కనుచితంబు;
సకలుఁడుఁడవ ననునుడి సిద్ధసాధనంబు;
కావునఁ బ్రమాణ మౌచిత్యకలన దేవి.

సత్య:—సమయము గ్రహింపక మహారాజుగారియే కాంత

గోష్ఠికి భంగము గలిగించిననాకు మాత్ర ముచితకృత్య మేమి తెలియును ?

శ్రీకృ:—(తనలో) అయ్యో! ఇప్పుడు శ్రీవత్సుండైనను దగ్గఱ లేఁడుగదా!

శ్రీవత్సుఁడు:—(ప్రవేశించి నిర్వేదముతో) అయ్యో మంద మతికిఁ దోడు నా కెంతమఱపు! లేఁజిగుళ్ళపై నున్నపాడు తుమ్మెద ప్రేలిమీఁదఁ గుట్టఁగా బాధపడుచు సత్యభామ యోగమాయామహోత్సవమునకుఁ బోలే దని ప్రియవయ స్యునకు నివేదింప లేదు. ఆతఁడును బరాకునఁ గన్యకతో నేకాంతగోష్ఠి నడపు చున్నాఁడు. నే నేఁగి యేమఱి యుం డకు మని. హెచ్చరింతును. (పరిక్రమించి సత్యభామను జూచి భయముతో) అమ్మయ్యో! ఏకాంతగోష్ఠివిఘ్నదేవత సత్యభామ ముందుగానే యిక్కడ వెలసినది. కావునఁ గదలక మెదలక యిక్కడనే కూర్చుందును.

(మెల్లగాఁ గూర్చుండును)

శ్రీకృ:—(సత్యభామచేయి పట్టుకొని)

గీ. సాపరాధుఁడ దండ్యుఁడ నైన నేను
దానకీసపురోభూమినే వసింప
దండన మొనర్ప వలఁతి వై యుండి కూడ
నూరక యె రోషపడె దేల? ధీరహృదయ,

ప్రేసీ, వినుము.

చ. లసితవిభంగబద్ధకుటి
లభ్రుకుటీవినిబద్ధుఁడఁ; రయో
చ్ఛ్వసనవితాడితాధరవి
తాడితుఁడఁ; బటునేత్రరక్తిమ
ప్రసరనిరుద్ధకర్ణసఖ
*రక్తసరోజనిరుద్ధుఁడఁ; ననుఁ
వెసఁ బరుషాళివోలెఁ బ్రియ,
నీదురుపారమ చేసె దండితుఁ.

(పాదములపైఁ బడఁ బోవును)

సత్య:—(చేయి లాగుకొని చతురికతో నిష్క్రమించును)

శ్రీకృ:—(దైన్యముతో నిట్టూర్పు విడిచి) దైవము ప్రతికూలముగా నుండఁ బౌరుష మేమి చేయఁ గలదు?

ఉ. ఆనఁగ లేద యింతియధ
రామృత మంతికమందె యున్న; సం
ధానిత మయ్యె దేవికి మ
నంబున నప్రియవజ్రలేప; మ
జ్ఞానన ముగ్ధ హస్తగత
యయ్యె సపత్నుల; కిట్లు వుండటఁ
గానఁగవచ్చు చున్నయది
కల్మషకర్మవిపాక మక్కటా!

* "కహ్లారే" అని మూలము.

శ్రీవ:—(మెల్లమెల్లఁగా లేచి దగ్గఱకు వచ్చి) వయస్యా, వయస్యా, అబ్బా! వదలిపోయినదయ్యా, జన్మనక్షత్రోపద్రవము.

శ్రీకృ: —మిత్త్రమా, యోగమాయామహోత్సవమునుండి వచ్చి దేవి యీవృత్తాంతము విని ప్రియతమ నెంత బాధించునో యని కలవరపడుచున్నాను.

శ్రీవ:—వయస్యా, రాఁగలకష్టమును నీవే తొలఁగింపవలెనని మఱియొకయుపాయము లేదని నావిన్నపము. కనుక రా. సత్యభామ ననుసరింతము.

శ్రీకృ:—ఇప్పు డిట్లే చేయవలెను.

శ్రీవ:—ప్రియవయస్యా, ఇటు. ఇటు.

శ్రీకృ:—(స్మరించుకొని యాకాశమున లక్ష్యము నిలిపి) ప్రేయసీ, కువలయావలీ, ఆవిధముగా.

గీ. తరళితము గంటకకలికాపరిగతంబు
నైనతావకతనులతచే నతాంగి,
తలఁతు మద్భాగ్యరాజ్యంబు స్థైర్యసంయు
తంబుఁ గాఁగను నిష్కంటకంబుఁ గాఁగ.

(వయస్యునితో నిష్క్రమించును)

ఇది తృతీయాంకము

# ప్ర వే శ క ము

[కస్తూరిక ఘనసారిక యనునిరువురు పరిచారికలు ప్రవేశింతురు]

ఘన:—చెలీ, కస్తూరికా, యోగమాయామహోత్సవమునకుఁ బోయి వచ్చినది మొదలు దేవిగా రకారణముగాఁ బరిజనముమీఁదఁ గోపపడు చున్నారు. కారణ మేమి ?

కస్తూ:—చెలీ, ఘనసారికా, కదళికాగృహమున దొరవారు నడపినకథ సత్యభామమ్మగారు చతురికమూలమున దేవిగారికిఁ దెలిపినారు గదా !

ఘన:—ఔను. మఱి, కువలయావళిసంగతి యే మైనది ?

కస్తూ:—'నారదులవారు మరలఁ దపోవనమునకుఁ దీసికొని పోయినా' రనుమాట పుట్టించి యామెను మనవంటివారు పోరానిసప్తచ్ఛదప్రాసాదములోని సారంగపుఁగొట్టులోఁ బెట్టినారు. ఇప్పుడు కులక్రమాగతులు విశ్వాసపాత్రులు నైనయంతఃపురజను లామెకుఁ గావలి యున్నారు.

ఘన:—మునుపు దేవిగారి కిట్టిస్వభావము లేదు. ఇప్పుడు సత్యభామమ్మగారియుపదేశమున స్వభావము మాఱి దీర్ఘకోపన యైనది. కనుక నే 'గుణదోషములు సహవాసమున సంక్రమించు' నందురు.

కస్తూ:—చెలీ, మహాదేవిగారు లోకములోనిస్త్రీ లందఱవంటి వారే యనుకొన్నావా యేమి? యి ట్లను చున్నావు?

ఘన:—చెలీ, ఇంతుల కెల్ల మేలుబంతి బంధువిసర్జిత దాక్షిణ్యానిధి యైనయట్టికన్యారత్నమున కిట్టినిరోధము గలిగించినారు గదా యని యూవేదనపడి యిట్లంటిని.

కస్తూ:—చెలీ, నీకుఁ దెలియదా? కువలయావలిపై మహాదేవిగారికే ప్రేమ యెక్కువ. ఐనను దనయొద్ద నిల్లడ వెట్టిన యానారదులవారికి భయపడి, సవతులమీఁది దాక్షిణ్యము నకు లోఁబడి, యాకన్నె నతిప్రియానమున దాఁచుచున్నది.

ఘన:—నారదులవా రొప్పుకొనినఁ గువలయావలికోరిక ఫలించునని నీకుఁ దెలియునా?

కస్తూ:—అందుకు సందియ మేమి?

ఘన:—(కనికరముతో) దాక్షిణ్యానిధి దుఃఖశీలయు నగునా యింతి సుఖించుఁ గాక.

కస్తూ:—చెలీ, ఘనసారికా, ఏలినవారిసంగతి యె ట్లున్నదో నీ వేమేని విని యున్నావా?

ఘన:—బభ్రుముఖునివలన విన్నది విన్నట్లుగానే నీకుఁ దెలిపెదను.

చ. యదుకులచక్రవర్తి తర

ళాక్షిపయిం గలకూర్మి పెంపునకా

విదళితధైర్యుఁడై సచివ
వృద్ధనిరోధమునన్ క్షణం బెటో
కదలక గద్దె నుండుఁ; బ్రభు
కార్యము లన్ మిషఁ రాణివాసమున్
వదలు; నొనర్చు దాసవచ
నంబులకున్ బ్రతికూలకార్యముల్.

కస్తూ:—(గుండెలపైఁ జేయి వైచుకొని) ఔరా యేలినవారికి వలపు కడు గాటముగా నున్నది !

ఘన:—(చూచి) ఇదిగో, అంతిపురముపరిజన మిట నట నకిట కదలక మెదలక యున్నది. కనుక దేవిగారిని బతిమాలుకొనుట కేలినవారు వచ్చియున్నా రని తలఁతును.

కస్తూ:— అ లైన మఱి రా. దేవిగారికడకుఁ బోదము.

(ఇరువురు నిష్క్రమింతురు)

ఇ ది ప్ర వే శ క ము

శ్రీ

# రత్నపాంచాలిక



## చతుర్థాంకము

---

[శ్రీకృష్ణుఁడు విదూషకుఁడును బ్రవేశింతురు]

శ్రీకృ:—(అనురాగనిర్వేదములతో)

మ. అవు సంయోగము నేఁడొ రేపొ యని ప్రే
మాక్రాంతులై, యొంటిపా
టవున నెల్లను నంతరాయ మెదియో
ప్రాప్తించి విశ్లేష ము
ద్భవిలన్ విహ్వలులై, సుహృజ్జనసమా
శ్వాసైకజీవాను లా
యువలన్ మాయ మనోరథాత్మక నిజ
మ్మొక్కమ్మడిన్ వేఁచెడిన్.

శ్రీవ:— వయస్యా, కస్తూరి పోయినను నాభిచర్మమును వదలకున్నావు. కనుకనే నారదుఁడు కువలయావలిని గొనిపోయినను నీమనసులోనితవాతవా యట్లే యున్నది.

శ్రీకృ:—(వినమి నభినయించి)

చ. అరవిరి*తావికల్వ సిగ
యందు సలీలముగా ఘటించుచున్
గరము వడంకఁ జెక్కిటను
గస్తురిఁ బత్త్రలతన్ రచించుచున్
గురుకుచపాళికన్ మకరిఁ
గుంకుమ *మైపై పులకింప వ్రాయుచున్
దరితమృగాక్షితో నెపుడు
తన్మయతన్ విహరింపఁ గాంతునో?

శ్రీవ:—వయస్యా, ఆనాస్తికతాపసుఁడామెను వెంటఁ బెట్టుకొని యిప్పుడే గదా తపోవనములోఁ బ్రవేశించినది! మఱి, రా. అతివేగముగాఁ బరువెత్తుగేడెకాళ్లగుఱ్ఱములు గట్టినరథ మెక్కి యాతని వెంబడింతము.

శ్రీకృ:—(నిట్టూర్పుతో) వెంబడించి మనము చేయవలసిన దేమి?

శ్రీవ:—(సంరంభముతో) ఆతనితో దండాదండి బాహాబాహి నేను బోరాడెదను. బ్రాహ్మణు లన్న భయపడు నీ వాకన్నెను విజయలక్ష్మినిబోలె రథముపైఁ గూర్చుండఁ బెట్టుకొని ద్వారవతికి రమ్ము.

* తావికల్వ = సౌగంధికము. మైపై = మేను.

శ్రీకృ:—మిత్త్రమా, నారదభగవానుఁ డిక్కడకు వచ్చి నన్నుఁ జూడకయే వెడలిపోయె ననుట నిజముగాఁ బ్రవాద మాత్రమే యని నాతలఁపు.

శ్రీవ:—రాణిగారిపరిచారికల కంతయుఁ దెలిసి యుండును గదా! (ఇరువురు పరిక్రమింతురు. నేపథ్యమునఁ గలకలము)

శ్రీవ:—వయస్యా, తొందరపడు. తొందరపడు. నారదుని శిష్యగణము నీకై మొఱలిడు చున్నది. కనుక నెవఁడో రాక్షసుఁ డాబ్రాహ్మణునిఁ జంపి కువలయావలి నపహరించినాఁ డని నే ననుకొనుచున్నాను.

శ్రీకృ:—భయవిహ్వలుఁడ వై మతి చలించి యసంబద్ధ ప్రలాపము లాడుచున్నావు. ఈయాక్రందనము సప్తచ్ఛద ప్రాసాదపరిసరములోనిపరిజనులది. కనుక దీనికిఁ గారణ మేమో తెలిసికొందము రమ్ము.

(పరిభ్రాంతపరిజనముతో విషణ్ణ యగురుక్మిణి ప్రవేశించును)

రుక్మిణి:—(దుఃఖముతో) ఓసీ, సుగంధికా, అయ్యో నే నుపేక్షించి చెఱపా లొనర్చిన కువలయావలిమూలాన—'నిజముగా రుక్మిణి పరిజనులపాలిటిమృత్యు' వనులోకనిందకు గుఱి నైతిని. ఇంకఁ గళంకపంకిల మైనయీజీవితము నాకేల? ఆర్యపుత్త్రునకు నానిర్ణయమును విన్నవింపుము.

సుగం:—దేవీ, అత్యంతప్రియవలె ఁజేల వగుచున్నావు. కనుకనే యనురాగాతిశయముతో ఱెప్ప వేయక నిన్నే చూచుచు నిటు వచ్చుచున్నదొరవారిని గూడఁ జూడకున్నావు.

రుక్మిణి:—(చూచి గద్గదస్వరముతో) ఆర్యపుత్రా, రక్షింపుము. రక్షింపుము.

శ్రీకృ:—(ఆదరముతో సమీపించి) విదర్భరాజనందనా, మహాదేవీ,

గీ. నాకభూతలపాతాళలోకవాసి
సకలజంతువితానరక్షకుఁడ నైన
నేను నీకింకరుండ నై నిలిచి యుండ
నెవనివలనను గలిగె నీ కిట్టిభీతి ?

రుక్మిణి:—(చెప్పఁ దలఁచి, సిగ్గుచే వెలవెలఁబోయి సుగంధికను జూచును)

సుగం:—మహారాజా, సప్తచ్ఛదప్రాసాదపుగదిలో నున్న కువలయావలి నెవఁడో యదృశ్యుఁడై వచ్చి యపహరించినాఁడు. అందుకై దేవిగారు కలవరపడుచున్నారు.

శ్రీకృ:—ప్రేయసీ, ఇంతమాత్రమునకే కలవరపడితివా ? ఈకన్యక నీయొద్దనే యున్నదని నమ్మి యూఱడిల్లుము.

(నేపథ్యమున)

ఓరోరీ, ద్వారవతీవాస్తవ్యవీరమ్మన్యపురుషాధములారా, ఈ కాలయవనసహోదరవీరునిభీషణభాషణము లాలకింపుఁడు.

గీ. ఘనమదావళరదలగ్నకమలినిబలె
మద్భుజాపంజరస్థ నీమదిరనేత్ర!
గోర్కి కలదేని కావ మాగొల్ల యొకఁడొ
యెల్ల రొక్కుమ్మడినొ గాని యెత్తిరంచు.

శ్రీకృ:—అహో అనాత్మవేది కాలపాశవశవర్తి యైప్రేలు దానవునిప్రలాపము గర్వగ్రంథిబంధురము!

శ్రీవ:—ప్రియవయస్యా, దేవీరక్షణమునకు నేను నడుము కట్టుకొనెదను. నీవు మాయావి యగునాదానవు సేమఱక సంహరింపుము.

రుక్మిణి:—సుగంధికా, నీ వేఁగి యార్యపుత్రునినిశ్చయము నార్యసత్యవర్తకుఁ దెలుపుము.

శ్రీకృ:—ప్రేయసీ, వీరసమరసమయములు నెఱుఁగవా ? విరోధి యేకాకి యై యుండ నేల యదువీరసన్నాహమును నియోగించుచున్నావు ? చూడుము.

గీ. శైలకూటవిఖండనచణము లెన్ని
యశనిధారలు వలయు సిద్ధార్థభిదకు ?
ఉచ్చగజకుంభకూటపాటచ్చరములు
మృగపతిచపేటములు దోమ కెన్ని వలయు ?

(సంరంభముతోఁ బరిక్రమించుచు సుదర్శనధ్యానగ్రహణ ప్రయోగముల నభినయించి యాశంకతోఁ జూచుచు)

ఆ. వె. అశనిఘోరధార మగుచక్రమును గాంచి
డాలు వాలు నసుర కేలఁ దాల్చె
(శంకావిషాదములతో)
వికటలూనుఁ డైనవీనియంసమునుండి
యక్కటా! పడుచున్న దికకృశాంగి.
కావున విహ్వాల యగునీయింతి నంతరాళముననే పట్టుకొని
చిఱుతరఁగతుంపురులఁ జల్లనగు మందగంధవాహంబుల
విలసిల్లువిలాసవనదీర్ఘికాతటమున మెల్లగా దింపుదును.
(నిష్క్రమించును)

రుక్మిణి:—అయ్యో, శ్రీవత్సయ్యా, దానవులు మాయావులు. ఆర్యపుత్రుఁ డొంటరిగా నేఁగినాఁడు. ఏమి విందుమో గదా!

శ్రీవ:—దేవీ, శుభమునే విందుము.

నారదుఁడు:—(ప్రవేశించి సంతసముతో)

గీ. ద్వాపరోదయ మాది శుష్కోపవాస
మున్నమన్నేత్రముల కిప్డు వెన్నుఁ డవని
నవతరింప విచిత్రరణావలోక
పారణాప్తి నజీర్ణంబు వఱలె వఱలు.

(రుక్మిణిని జూచి) ఈమెనే పురస్కరించుకొని మిగిలిన కార్యము సాధింతును. (సమీపించి) మహాదేవీ, భర్తృవిజయమున వర్ధిల్లు చున్నావు. వినుము.

గీ. సప్తసాగరపూరంబుసరణి మున్ను
సురలు గాంచినయామహోదయుఁడు నేఁడు
చక్రధారానలజ్వాలజాలమునను
ఘృతకణంబును బోలె నిజ్జింకులింకె.

రుక్మిణి:—(హర్షసంభ్రమములతో నారదమహర్షి పాదములకు మ్రొక్కి) భగవానునిప్రసాదమున బ్రదికితిని.

శ్రీవ:—(తనయుత్తరీయము నెగుర వైచుచు) హీ! హీ! ప్రియవయస్యుఁడు జయించినాఁడు. మాభాగ్యము పండినది. (నర్తనము చేసి వినయముతో) స్వామీ, శ్రీవత్సుఁడు చెవులు సోఁకునట్లు రెండుమాఱ్లు మీతిరువడిఘళ్లకు మ్రొక్కుచున్నాఁడు.

నార:—ఇట్లే సంతోషివై యుందువు గాక.

రుక్మిణి:—స్వామీ, మాసోదరికివలయావలికాయము గాయపడ లేదు గదా!

నార:—దేవీ, ఇట్లు నైజ మగునీయాదరమునకుఁ బాత్ర మైనయామెకుశలసంపద తెలుప నేల?

రుక్మిణి:—ఇప్పుడు గదా నాపుణ్యము పండినది! (పరిజనము నవలోకించి) మీ రేఁగి యార్యపుత్రునకు మంగళనీరాజనము దీసికొని రండు.

పరిజనము:—చిత్తము. (నిష్క్రమించును)

సుగం:—స్వామీ, ఏలినవా రిప్పు డెక్కడ నున్నారు ?

నార:—ఇదిగో, మూర్ఛవోయినకువలయావలిని సేదదేర్చుచు నడబావియొద్దున నున్నాడు.

రుక్మిణి:—స్వామీ, అక్కడకుఁ బోదమా ?

నార:—మహాదేవియిష్టము.

(అందఱు పరిక్రమింతురు)

నార:—(తనలో) ఈదివ్యవృత్తాంతము దేవికి నివేదించుట కిదే తరుణము. (ప్రకాశముగా) బిడ్డా, వైదర్భి, నీ కొక రహస్యమును విన్నవింపఁ గోరుచున్నాను.

రుక్మిణి:—స్వామీ, ఆజ్ఞాపింపుఁడు.

నార:—(జనాంతికముగా)

ఉ. ఏసమయంబునందును సి
రీ, భగవచ్చరణారవిందసే
వాసఖి తోడఁబుట్టు నగు
పంటవలంతి స్మరింతువే గదా !
ఆసతియే సుమీ కువల
యావలి యై జనియించె నిట్లు ప
ద్మాసనుప్రార్థనన్ సురహి
తార్థము నీవలె భూతలంబునన్.

రుక్మిణి:—(తనలో) ఇందులకు మహర్షి కీయఁదగినయుత్తర మేమి ? (ప్రకాశముగా) సుగంధికా, సత్యావాదిను లగు నా చెల్లెండ్ర కిట్లు విన్నవింపుము. 'మహోపకార మొనర్చి

నయార్యపుత్రునకుఁ గాన్క యీయఁ దలఁచితిని. దీనికి మీరు సమ్మతింపవలె' నని.

సుగం:—చిత్తము. (నిష్క్రమించును)

నారః:—బళీ ! కల్యాణశీలా, బళీ !

గీ. అవని నుపకారు లగువారి కాదరమునఁ
ప్రత్యుపక్రియ సేయక బ్రదుకువారి
యింద్రసంపద మీఱుశ్రీ యేల ? యేల
యాయు వేనియుఁ గల్పశతానువర్తి ?

(మూర్ఛపోయినకువలయావలియు దగ్గఱఁ గూర్చున్న శ్రీకృష్ణుఁడును ప్రవేశింతురు)

శ్రీకృ:—ఏమిది నాప్రాణవల్లభ యిప్పటికిని దేఱుకొనలేదు! కనుకఁ దామరాకుదొప్పతోఁ జల్లనినీరు దెచ్చి చిలుకరించి యీయింతిని దేర్చెదఁ గాక. (కొంచెము దూరము పరిక్రమించి విని సంతసముతో) ఆహా! ఈలలన తనంతనే తేఱికొని యేమో యనుచున్నది. కావున నేను దాఁగియుండి వినెదను. (అట్లు చేయును)

కువల:—(నలుదైపులు చూచి) ఔరా ! ఆయుద్యానమే యిది. (ఆలోచించి) ఇతరు లెవ్వరును జూడక మునుపే యీనడబావిలోఁ బడి మరణింతును. (నెమ్మదిగా లేచి నడబావియొద్దకుఁ బోవును)

శ్రీకృ:—గీ. దోయిలి ఘటింతు వాసనాస్థాయి యగుచుఁ
బరగునన్యోన్యరాగానుబంధమునకుఁ
దలఁపఁ బ్రాణపరిత్యాగదశయు నెందు
నుల్లసనకారణం బయి యుల్లసిల్లు.

(వెంబడించును)

శ్రీవ:—ఇదే యుద్యానము. ప్రవేశింపుఁడు.

(అందఱు ప్రవేశింతురు)

కువల:—(దోసి లొగ్గి)

గీ. కరయుగము మోడ్తు దీర్ఘికా, కనికరింపు
స్వీకరింపుము ప్రేమ నీజీవితంబు
ఇంక నాయువు నాకు నే మేని యున్న
నాప్రభువు దానిచే సౌఖ్య మందుఁ గాక.

(పడఁబోవును)

శ్రీకృ:—(కువలయావలిచేయి పట్టుకొని)

గీ. ప్రాణనాయిక, నీ విట్టిపని యొనర్పఁ
జిరము మనినను నా కేల జీవితంబు?
చంద్రికాలక్ష్మి వదలినఁ జంద్రుఁ డేల?
ఢంబు వీడిన నింద్రనీలం బదేల?

మఱియును.

మ. సరసీజస్థితి సత్పరీమళమిళ
చ్చైవాల మున్నిద్ర షం

బరగావర్తము చక్రరమ్యమనుకం
పావారి నీదేహ మర్ణా
సర; సందుర్ణా మునుఁగఁ గుమారిలెడి న
స్మన్మానసం బందుచేఁ
దరుణీ, యాఱదు దీర్ఘికం బడిన నీ
తాపంబు ముమ్మాటికిన్.

కువల:—(శ్రీకృష్ణునిఁ జూచి హర్షలజ్జాసంభ్రమములతోఁ దనలో) అయ్యో! ఈసమయమున నీమహాపురుషుఁడు గనఁబడినాఁడు. (ప్రకాశముగా) ఓయీ, నన్ను వదలుము. ఇట్లవినయ మాచరించి దేవిగారిమొగము చూడఁ లేను.

శ్రీకృ:—గీ. ఇదియె నీనిశ్చయం బగునేని కలికి,
యట్టిసాహస మేను గా దనను గాని
మానశాలిని, నీ కేను మార్గదర్శి
నగుట కెంతయు నుబలాట మందువాఁడ.

కావున,

ఉ. ఆదట మత్కరంబుఁ దరు
ణాంగుళిపల్లవభాసమాన తా
మ్రోదరవామహస్తమున
నూని ద్విరుక్తిజితాబ్జముల్ భవ
త్పాదము లీసరోవరవి
భాసిమహామణికుట్టిమంబులం

దూఁదుము మందమందముగ
నోమదకుంజరమందగామినీ,

(చేయూఁత యిచ్చి ముందఱ నిలువఁబడును)

కువల:—(చేయి లాగుకొని) పాపము శమించుఁ గాక ! పాపము శమించుఁ గాక! అమంగళము ప్రతిహత మగుఁ గాక! అమంగళము ప్రతిహత మగుఁగాక! (వెనుకకుఁ దిరిగి నిలువఁబడును)

శ్రీకృ:—(సాభిప్రాయముగా) ప్రేయసీ, నవబాలియౌ దిది యొక్కటి విలోకింపుము.

గీ. పతి నమలి విరళితకాండబంధబిసముఁ
జంచుపుటమున నుంపఁగఁ జక్రవాకి
వదలఁ గైకొనఁ జాలదు వాలుఁగంటి,
యే నొసంగినయధరంబు నీవు వోలె.

కువల:—అతఁడు గూడ నొక ధూర్తుఁడు.

శ్రీకృ:—ప్రేయసీ, నేను మఱియొక ధూర్తుఁడనా ?

శ్రీవ:—(ఉచ్చై స్స్వరముతో) దేవీ, ఇటు. ఇటు.

శ్రీకృ:—(విని తనలో) ఓహో దేవిరాకను వయస్యుఁడు సంజ్ఞచే సూచించు చున్నాఁడు ! (ప్రకాశముగా) ఎవఁడురా యక్కడ ? కువలయావలిని దీసికొని వచ్చితి నని విన్నవింపుము.

రుక్మిణి:—(దగ్గఱకు వచ్చి సంతోషముతో) ఆర్యపుత్రునకు జయము జయము.

శ్రీకృ:—(ఆదరముతో) మహారాజ్ఞీ, నీశాసనమున దానవునిబాఱినుండి యీకన్నెను విడిపించుకొని వచ్చితిని.

రుక్మిణి:—(సిగ్గుపడుచున్నకువలయావలిని కౌఁగిలించుకొని) చెల్లెలా, అక్షతగాత్రిని నిన్నుఁ గలిసికొని లోకనిందావిముక్తి నొందితిని.

శ్రీకృ:—(తనలో) ఓహో భగవానులు నారదులవారిక్కడనే యున్నారు! (ప్రకాశముగా) దేవర్షి, అభివాదనము. (నమస్కరించును)

నార:—(ఆనందాతిశయముతో)

గీ. స్వస్తి వసుదేవసుతునకు స్వస్తి యాతు
ధానకులవనదావవైశ్వానరునకు
స్వస్తి సకలమంగళమూలవస్తువునకు
స్వస్తి కారుణ్యశాలికి స్వస్తి హరికి.

శ్రీవ:—దేవీమానససమారాధన చేసి ప్రియవయస్యుఁడు వర్ధిల్లుచున్నాఁడు.

శ్రీకృ:—(చిఱునవ్వుతో) ఓహో ప్రియవయస్యుఁడా!

రుక్మిణి:—చెల్లెలా, భగవానునకు నమస్కరింపుము.

కువల:—(చూచి) ఆహా తాతపాదులు నారదులు! (నమస్కరించి కన్నీరు విడుచును)

నార:—పుత్రీ, లోకకంటకోద్ధరణకారణమవు. జగదుపకారిణివి. నిన్నుఁ గాంచి కృతార్థుఁడ నైతిని.

సుగంధిక:—(ప్రవేశించి) మహాదేవీ, రాణు లందఱు నిట్లు విన్నవించు చున్నారు. 'అక్కగారికార్యాలోచనకు సంతసించితిమి. మహారాజ్ఞిగారు తమ యిష్టమువచ్చినట్లే చేయుదురు గాక' అని.

రుక్మిణి:—(జనాంతికముగా) స్వామీ, కువలయావలి నార్యపుత్రునకు సమర్పింతును.

నార:—'నీ వీమె కధికారిణి' వని మేము మున్నే విన్నవించి యున్నాము.

రుక్మిణి:—ఆర్యపుత్రా, మీకు నేను మాన్యురాల నేని యీమెను మాతో సమానముగాఁ జూచుకొనుము. (కువలయావలికరమును శ్రీకృష్ణునికరమునం దుంచును)

శ్రీకృ:—(తనలో)

క. వనజేక్షణ యేకముగాఁ
బొనరించినప్రియులహస్తములు మిళితము లై
ఘనసారగంధసారము
లనుబోలెఁ దనర్చుఁ దాపలుంటాకము లై.

నార:—(బహుమానముతో) దేవా, దేవీశాసనము నిఖిలశ్రేయోనిదానము.

శ్రీకృ:—భగవానునియాజ్ఞ. (కువలయావలికరమును గ్రహించును. అందఱు హర్షము నభినయింతురు)

శ్రీవ:—సులగ్న మగుఁ గాక.

నార:—పుత్రీ, వైదర్భీ, మాయుపదేశమును నీ వొక్కతెవే నిర్వహించితివి.

క. స్తుతితతి కర్హము లితర
వ్రతములు వే యుండుఁ గాక వసుధాస్థలిలోఁ
బతిచిత్తరంజనంబే
సతులకుఁ బరమవ్రతంబు సద్గుణనిలయా,

(ఆకాశమున దుందుభిధ్వని)

నార:—దేవా, ఇది భవత్కువలయావలీకల్యాణము నభినందించుచున్న దేవతలయానందవిలాసము.

శ్రీకృ:—(సవినయముగా నారదునకు నమస్కరించి) స్వామీ, భవత్ప్రసాదమునను దేవీప్రసాదమునను నా కెన్నెన్ని శ్రేయస్సులు కలుగుట లేదు ?

నార:—(హర్షోత్కర్షముతో)

మ. అతిరమ్యంబును సుప్రసాదమధురం
బౌవాణి నా రుక్మిణీ
సతి యొప్పున్; దగు దీ వుదార గరిమన్
శ్లాఘ్యార్థముంబోలె; మ

త్సుత యీకన్యక పాణిపీడకరణిఁ
శోభిల్లు; మీ మైత్రి య
ద్భుత మై వర్ధిలు మాధృతిల్ సహృదయుల్
పొందన్ మహానందమున్.

నీ కింకను నేమి ప్రియము చేయుదును ?

శ్రీకృ:—

సీ. ఘనమానమును వీడి కావించెను హితంబు
ప్రియముమై నిఖిలదేవీగణంబు
హృదయరంజకగుణ యీకన్యకామణి
నెలకొల్పఁబడియె రాజ్ఞీపదమున
భగవానుఁడవు నీవు ప్రతిదినంబును హితా
హితముల శాసింతు వెలమితోడ
సురహిత మొనరింప సురవిరోధివిరోధి
చయముఁ జక్కాడెను జక్రధార

ఆ. వె. అందువలన నస్మదాకాంక్షితము లెల్ల
నిండె మున్ను; నేఁడు నిండు చుండు;
నిండఁగలవు ముందు; నిత్యకల్యాణము
పచ్చతోరణముగఁ బరగు చుందు.

అయిన నిది యగుఁ గాక.

## రత్నపాంచాలిక

(భరతవాక్యము)

గీ. కలిగెడుం గాక ముల్లోకములకు శుభము
వైదికపథంబె యగుఁ గాత వర్ధితంబు
మాపకుందురు గావుత మచ్చరీంద్రు
రసికవిశ్వరసరససారస్వతములు.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది చతుర్థాంకము

గీ. పలుకుపలుకునఁ దేనియ లొలుక సింగ
జనవరకృత మై రత్నపాంచాలికాఖ్య
వెలయు నీనాటికకు రసవేటికకును
వఱలు విశ్వేశ్వరునియనువాదసుకృతి.

శ్రీ వేంకటేశ్వరార్పణ మస్తు.

---